బాలానంద

# బాలనాగమ్మ




నాగశ్రీ


నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ .................... విజయవాడ-2

ప్రథమ ముద్రణ
1986

ముఖచిత్రం:
వి. యస్. ప్రకాష్

ప్రచురణ :
నవరత్నా బుక్ సెంటర్
ఏలూరు రోడ్, విజయవాడ-2

ముద్రణ :
"వెంకటరత్నా"
విజయవాడ-2

వెల : రు. 10-00

# విషయసూచిక

# బాలనాగమ్మ

## భూచక్రపట్టణము

అది భూచక్ర పట్టణం. కాశీనగరానికి పడమరగ మున్నూరామడల దూరంలో ఉన్నది. దానిని సూర్యవంశపురాజు లేలే కాలం. నవభోజిరాజా భూచక్రపురాన్ని మహా వైభవంగ పరిపాలిస్తున్నాడు. ఆయన పాలనలో ప్రజలు కేచీకు చింతలు లేకుండా సుఖసంతోషాల ననుభవించారు. నవభోజ రాజుగారి పట్టపుదేవి భూలక్ష్మి. ఆమె మహాపతివ్రత. పేరుకు తగట్టుగానే భూమికన్న మించిన ఓర్పు గల మాదొడ్డయిల్లాలు.

ఆ రాజ దంపతునికి సంతానం లేకపోయింది. ఎన్నో నోములు నోచారు—ఎన్నో వ్రతాలుచేశారు— ఎన్నోక్షేత్రాలు సేవించారు—ఎన్నో దాన ధర్మాలు చేశారు- నాగప్రతిష్ఠలు చేశారు- పేదబ్రాహ్మణ బాలురకు ఉపనయ నాలు చేయించారు- పెండ్లిండ్లచేయించారు-మంచినీటి చలివేంద్రాలుపెట్టించారు- అన్నసత్రాలు గట్టించి నిత్యాన్నసమారాధనలు కూడా లెక్కలేనన్ని చేయిం చారు— ఐనా వారికి పిల్లలు కలుగలేదు.

ఒకనాడు నవభోజారాజు కొలువుచాలించాక పన్నీటి స్నానం చేసి, వెండి పీట మీద కూర్చుండి బంగారు పళ్లెరంలో ఆవకాయ పిండి వంటలు— నాలుగునంజుళ్ళతో భోజనం చేసి వచ్చి పట్టుపానుపు మీద పవళించిన సమ

యం— రాజసేవకులు వింజామరలు వీచు చుండగ మహారాణి వచ్చింది. భర్తకు నమస్కరించి, ఉచితాసనం మీద కూర్చుని కర్పూరపు తాంబుల మందిస్తూ "ప్రభూ! మనకు సర్వసంపదలున్నా సంతానం లేని కొరత తీరలేదు కదా! మనకు పన్నెండామడల దూరంలో కొండ మీద జటంగమహాముని యున్నాడట. ఆయనగారు గొప్ప ప్రభావం కలవారట. ఆరు నెలలు కొక సారి కన్నులు తెరచి చూస్తారట. ఆ సమయంలో అయన నర్థించిన వారి కోరికలు తప్పక నెరవేరుతున్నాయట కూడాను. నమ్మదగిన వారివల్ల నాకా విషయం తెలిసింది. ఎల్లుండి మునీంద్రులు కన్నులు తెరిచే రోజని కూడా తెలిసింది. మనమక్కడకుపోయివారివలనపుత్రవందులుమయ్యే మార్గంతెలుసు కుందామను కుంటున్నాను. మీరు నాయీ కోరిక కాదనకండి" అని దీనంగా వేడుకుంది.

ఆ మాటలకు వింటునే రాజుగారి కన్నులు చెమ్మగిల్లినై. భూలక్ష్మీ దేవిని దగ్గరకు తీసుకొని పిచ్చిదానా! నాకు మాత్ర మా విచారం లేదంటావా! అందే తాకుండా నాతరువాత యీ భూచక్రనగం పాలించే వారముడు లేడని కూమ చింతిస్తూన్నాను; ఐతేమేం మగవారం కనుక మీలాగ బయటపడం. ఇంతకూ మన మిప్పుడా జటంగ మహామునిని దర్శిచడం యెంతయినా మంచిది. కాని వారం రోజులు దాకా రాజ్యాంగ పనులలో నాకు తీరిక లేదు. అందుచేత నీ ప్రయణానికి తగిన మేర్పాటులన్నీ చేయిస్తాను కావలసినంత పరివారాన్ని నీవెంట పంపుతాను. నీవు నిశ్చింతగా పోయిరమ్మంటూ అంతా సిద్ధం చేయించాడు.

భూలక్ష్మీదేవికి వెయ్యేనుగుల నెక్కినంత బలం వచ్చింది. మహానందంతో కులదేవత నారాధించుకుని భర్తకు నమస్కారం చేసి రాజభోయిలు తెచ్చిన మేనానెక్కి యోగమునీంద్రుల వారి కొండకు పోయి చేరుకుంది.

## పాల మామిడి పండ్లు

జటంగముని మంచి సత్తాగల యోగీశ్వరుడు. ఆయన చెప్పిన మాట అక్షరాల జరిగి తీరుతుంది. ఆరునెలల తరువాత పున్నమినాడు కన్నులు తెరచి చూచాడు. అంతవరకు కాచుక కూర్చున్న మహారాణి అమాంతంగ పాదాల మీద వ్రాలి "స్వామీ! మాకు పుత్రభిక్ష ప్రసాదించండి" అన్నది. జటంగముని తాపీగా "నీవెవర వమ్మా! నీకేం కావాలి" అని పరామర్శించాడు.

"స్వామీ! నేను భూచక్రనగర మేలే నవభోజరాజు భార్యను. నాపేరు భూలక్ష్మీదేవి. మాకు యెక్కేటందుకు మేడలున్నవి—ఏలేటందుకు ఊళ్ళున్నవి. అలంకరించుకొనడానికి ఆభరణాలున్నవి-అనుభవించడానికి ఐశ్వర్యాలున్నవి. కాని చంకనెత్తుకునేటందుకు చంటిపాపలు లేరు-కులము నిలిపేటందుకు కొడుకులు లేరు. మాకా సంతానం ప్రసాదించి యీ సంతాపం తీర్చండి" అంటూ దీనంగ వేడుకుంది.

మునీశ్వరుని మనసు కరగిపోయింది. ఒక్కసారి దివ్యదృష్టితో చూచి పెదవి విరిచాడు. "అమ్మాయీ! మీకీ జన్మలో సంతానం వలన సుఖపడే యదృష్టం కనపడలేదమ్మా! కావాలంటే బిడ్డలు కలగవచ్చును కాని కష్టాల పాలవుతారు. మగసంతానం కలిగితే నీభర్తకు ప్రాణగండం తప్పదు. ఆడ సంతానం కలిగితే నీకు ప్రాణగండం తప్పదు. తరువాత నీయిష్టం" అన్నాడు ముక్తసరిగ. భూలక్ష్మీదేవి నోటినుండి మాటరాలేదు. కొంచెం నిదానించాక "స్వామీ! మహారాజావారి క్షేమమే మాకు కావాలి. నేను చనిపోయినా నాకిష్టమే. స్త్రీ సంతానమైనా ప్రసాదించండి" అని పాదాలంటింది.

జటంగముని ఆమె భక్తికానందించి "అమ్మాయీ! అదుగో అట్టు చూచావా. ఆ గట్టుమీద మద్దిమానులు—వాని కావలగ పాలమామిడి చెట్టు—చెట్టు క్రిందగ పుట్ట—అక్కడకు పోయి చేతికందిన పండ్లు యేడు మాత్రమే కోసుకొని తిను. ఏడు పండ్ల కన్న యెక్కువ కోస్తే ప్రమాదం తప్పదు. జాగ్రత్తగ పోయి ర"మ్మన్నాడు. భూలక్ష్మీదేవి యానందానికి అంతులేక పోయింది. మఱుక్షణంలోనే అక్కడకు పోయింది. చెట్టునంతా కలయ చూచింది. మునీంద్రుని మాటలు మరచిపోయి యెనిమిది పండ్లు కోసుకుంది.

అంతలోనే పుట్టలోని త్రాచుపాము బుసగొట్టుతూ వచ్చి నిలువెత్తున లేచింది. మహారాణీ! మాటతప్పి యెనిమిది పండ్లు కోశావు. నిన్ను కాటు వేయ వచ్చానంటూ మనిషి స్వరంతో మాటాడింది. ఒక్క కనురెప్పపాటు కాలంతో ఆమె తప్పుకొన రానంత ప్రమాదానికి గురయింది. చేతులెత్తి మ్రొక్కింది. నాగేంద్రస్వామీ! పొరపాటు జరిగింది. ఈ పండ్లు నాకు కన

డానికి గాని తినడానికి కాదు. నాకు కలిగే పాపాయికి నీపేరు పెట్టుకుంటాను. నన్ను మన్నించు" అన్నది. సర్పరాజు జాలిపడ్డాడు. ఐనా "భూలక్షీ! మాట తప్పినందుకు మరణం విధింపక తప్ప" దన్నాడు.

రాణి ఆలోచించింది "అయ్యా! నేనిపుడు గొడ్డురాలను. బిడ్డలతల్లి నయ్యాక వారి వారి అచ్చట ముచ్చటలు చూచి యానందించడానికి ఆరు నెలలు గడుపీయండి. నేనే మీ పుట్టకు వచ్చి కాటంద పడతాను. నాకీ యవ కాశం కలిగించండి" అని కాళ్ళా వేళ్ళా బడి బతిమిలాడుకుంది. ఆమాట లకు తలాడించిన నాగేంద్రుడు "సరే నీకు గడువిస్తున్నాను. ప్రసవించాక ఆరు నెలలు దాటిన పున్నమి నాటికి నీవిక్కడకు రాకపోతే నీవెక్కడనున్నా నీకెందరు రక్షకులున్నా తెలతెలవారే లోపున నేనే వచ్చి నీప్రాణాలను పుచ్చు కుంటాను. పో"మ్మన్నాడు.

మహారాణి సలక్షణంగ తిరిగి నగరానికి చేరుకుంది.

## ఆడపిల్లల సంతానము

మామిడి పండ్ల నారగించిన మహారాణికి నెలతప్పింది. తొమ్మిది నెలలు నిండినై. పదో నెల వచ్చాక ఆమె కేడ్గురాడపిల్లలు కలిగారు. కులము నిలిపే కొడుకు లేడన్న కొరత తీరక పోయినా యేడ్గురాడపిల్లలను చూచు

కున్న రాజ దంపతులు మురిసి పోయారు. బ్రాహ్మణులకు దానధర్మాలు చేశాడు. బీదల కన్నదానం-వస్త్రదానా లిచ్చారు. నగరమంతా అలంకరించారు. రాజపురోహితుల వారిని రావించి పుణ్యాహవాచనాలు శాస్త్రసమ్మతంగా చేయించారు. మంత్రులు-సామంతులు—కాపులు కరణాలంతా చదివింపులు చదివించారు. ఆ కుమార్తె లేడ్గురకు సూర్యనాగమ్మ, చంద్రనాగమ్మ, ఉత్తరకన్యక, దక్షిణ కన్యక, పగడాల నాగమ్మ, ముని కన్యక, బాలనాగమ్మ లని నామకరణాలు చేశారు.

ఏడ్గురుకుమార్తెల కేడు బంగారపు తోట్లమరించారు. ఆ యిల్లంతా కళ-కళ లాడుతూంది. ఆరోనెలలో అమ్మాయి లందరికీ అన్నప్రాశనలు జరిగినై. దాసీలా పసిపాపలను పూలలో బెట్టి పెంచుచున్నా భూలక్ష్మిదేవి తన మమకారం తీరేలాగ పైడి గిన్నెలో పాలు పంచదారలు కలిపిన అన్నం గోటిముద్దలు పెట్టుకుని మురిసి పోతూంది. అలాగా రోజులు దొర్లిపోతూండగ ఒకనాడు ఉన్నట్టులుండి గుప్పున జ్ఞాపకానికి వచ్చింది నాగేంద్రునకిచ్చిన వాగ్దానం భూలక్ష్మి దేవికి. ఆమె పాలమామిడిచెట్టు దగ్గరకు పోకపోతే నాగేంద్రుడే వస్తాడు—కాటందుతాడు. ఆనాడు త్రయోదశి యైనందున యిక రెండు రోజులే గడవుంది. వెనువెంటనే బిడ్డల నందరినీ దాదుల కొప్పగించి ఆమె పడకగదికి పరుండి వాపోతూంది.

నవభోజరాజు స్వయంగా వచ్చి "భూలక్ష్మి! నీవిలా కన్నీరు పెట్టేదెందుకు? నీకు నావలన లోపమేదైనా జరిగిందా? నీ మనసులో బాధేమిటో నాకు గాకుండ యింకెవరికి చెప్పుతావు?" అని బుజ్జగించుతూ అడిగాడు.

భూలక్ష్మీదేవి పొంగి వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ జరిగిన దంతా చెప్పాక "యిక మీద నాబిడ్డల గతేంకానున్నదో మహారాజా!" అంటూ బావురు మన్నది. నవభోజరాజు కంతట నిలువు గుండెలు పడిపోయినై. కొంత సేప టికి తేరుకుని "ఏమిటి నాగరాజు పెట్టిన గడవు ఎల్లుండియేనా! రేపటి వ్యవధి యున్నది కదా! ఈ మరణం తప్పించే యుపాయ మాలోచిద్దాం" అన్నాడు.

మరునాడు కొలువులో మహారాజు గారామాట మంత్రుల కెరింగించాడు మంత్రులు వెంటనే మాంత్రికులను రావించారు. అంతా ఒక్కపై ఆలోచిం చారు వారంతా మహారాణిగారి ప్రాణాలను కాపాడడానికి కంకణం గట్టుకు న్నారు. అప్పటి కప్పుడే పనివారిని నియమించారు ఏడునిలువుల స్థంభాల నాటించారు. దానిమీదొక తూలమండగా వేయించారు. దానితో పెద్దయినుప పెట్టి లాంటిదానిని గొలుసులతో వ్రేలాడదీయించారు. ఆచిన్న యినుపగదిలో మహారాణీగారికి పానుపమరించారు. కావలసిన పాలు పండ్లు దానిలో భద్రపర చారు. భూలక్ష్మీదేవిని చక్కగా తలంటుస్నానం చేయించి పట్టుబట్టలు కట్ట బెట్టి ఆయినుప పెట్టిలో ప్రక్కమీద పరుండబెట్టారు.

అంతే కాకుండా రెండుస్థంభాల చుట్టును క్రింద లోతైన గాడిని త్రవ్వించి, దానినిండా మంటలు పెట్టించారు. భగభగ మండుతూన్న మంటల చుట్టూ మంత్రవేత్తలు విభూది చల్లుచున్నారు. వారి కాపలగ రాజభటులు విచ్చుకత్తులు చేతవుచ్చుకుని పాము కనబడితే ముక్కలు ముక్కలు చేయ డానికి వేయికన్నులతో కాచి తిరుగుచున్నారు. ఇదంతాచూచిన మహారాజు గారికి కొంత గుండె నిబ్బర మేర్పడింది.

పుట్టదగ్గర నాగేంద్రుడు బయటికి వచ్చిచూచాడు. భూలక్ష్మీదేవి రాలేదు గడవు దాటింది. మహారోషంతో మహారాణిని కాటందడానికి బుసలు గొట్టుతూ వచ్చి చూచాడు. ఇక్కడ జరుగుతూన్న తతంగమంతా చూచాక మరింత కోపంతో మండిపడ్డాడు. అక్కడ కక్కడనే అదృశ్యమై భూలక్ష్మీశయనిం చిన యినుపపెట్టిలో ప్రత్యక్షమై గట్టిగా ఒక్కసారి హూంకరించాడు— నాగేంద్రుడు.

నాగేంద్రుని చడివిని త్రుళ్ళిపడి లేచిన మహారాణి నమస్కరించింది. "స్వామి! నన్ను మన్నించు. నేనచటకు రాబోయిన మాట నిజం. ఇక్కడి మంత్రులు మాంత్రికులు నన్ను రానీయక నిర్బంధించారు. నేను నిరపరాధి" నన్నది. నాగేంద్రు డంతట "మహారాణి! నీవుఉత్తమరాలవు. నీవు నన్ను మోసంచేయ దలచిన దేమీలేదు. ఐనను నాటిమాట ప్రకారంగ నిన్ను కాటం దడం నాధర్మం. ఐనప్పటికి నీకు నేనొక మహోపకారం చేస్తున్నాను. ముందు ముందు నీయీ బిడ్డలు పడరానిపాట్లు పడబోతున్నారు. ఆసమయంలో వారిని నీవే కాపాడ కొనవలసి యుంటుంది. నీవు మరణించినప్పటికి నీప్రాణ వాయువులు భూమిమీదనే యుండేలాగునను. నీవు నీబిడ్డలను కాపాడగనే శక్తి పొందేలాగునను నీకు వరాలిస్తున్నాను.

నీవు నాపేరు పెట్టుకొనిన బాలనాగమ్మ వలన మనందరికీ పేరుప్రతి ష్ఠలు రానున్నవి. ఆ సమయంలో ఆమెచాల ప్రమాదాల పాలవుతుంది కూడ. నేనామెను వెన్నంటికాపాడుతానని నీకభయమిస్తున్నా "నంటూ దీవించాడు. భూలక్ష్మీదేవి" దేవా! నీదయయున్నచా"లని నమస్కరించింది. నాగేంద్రుడా

మెను కాటువేసి మాయమయ్యాడు. మహారాణి కెవ్వుమని కేకపెట్టి ప్రాణాల విడిచింది.

# మహారాణి మాణిక్యాలదేవి

తెలవారింది. ప్రభువులు మొదలైన వారంతా ప్రమాదం తప్పిందను కున్నారు. పైన గట్టిన పెట్టెను దించిచూచారు. మహారాణి మరణించింది. అంతా ఒక్కసారి పెద్ద పెట్టున బావురు మన్నారు. మంచిగంధం చెక్కలలో మహారాణి దహనం చేయబడింది. మహారాజుగారే స్వయంగ పనిగట్టుకొని పిల్లలకు తల్లిలేని కొరత కనపడకుండా పెంచుతున్నారు. పిల్లలంతా పెరిగి పదేండ్ల వారయ్యారు.

కొంతమంది మంత్రులు మహారాజావారిని మళ్ళీ పెండ్లాడమని హిత బోధ చేశారు. భార్య పోయిన విచారం మళ్ళీ పెండ్లాడితే వుండదంటారు. ఆ కుమార్తె లందరూ రేపు వారి వారి భర్తలమాట వినదగిన వారు. ఆనాడ మీరు ఒంటరి తన మనుభవింప కుండ పెండ్లాడమని పది రకాల చెప్పారు రాజు సరే నన్నాడు. మంత్రు లంతట పనిగట్టుక పోయి దేశదేశాలు తిరిగాక నయనవాది నగరం పాలించే ధవళరాజ కుమార్తె మాణిక్యాల దేవిని వధ వుగా మాటాడి లగ్నపత్రిక వ్రాయించుకొని వచ్చారు.

మంది మార్బలంతో రాచవారి మర్యాదలతో నవభోజరాజు పెండ్లి కుమారుడై నయనవాది నగరానికి తరలి పోయాడు. ధవళరాజు పెండ్లివారికి మర్యాదలు చేయించి మహా వైభవంగ వివాహం చేసి కట్నాలు కానుకలు సమర్పించాడు. పెండ్లి కార్య మంతా పూర్తయ్యాక అంపకాలు జరిగినై. మాణిక్యాలదేవిని వెంటబెట్టుకొని భూచక్రపురం పొలిమేర చేరే లోపల వారి పట్టపు టేనుగు చనిపోయింది. అంతఃపురం చేరేటప్పటికి పాడావు చని పోయింది. ఇన్ని విలయాలు జరుగుచున్నా మంత్రులు వాని కేవో సాకులు చెప్పి రాజుగారికా రెండవభార్య మీద అనుమానం కలుగకుండా సమర్థించు కుంటునే వస్తున్నారు.

నవభోజరాజున కామె మీద మమకారం తొలిగి పోయింది. మాణిక్యాలదేవి మనసులో తన పెనిమిటికి యీ పిల్లల పీడ వదిలిపోతేనే గాని తన మీద అనురాగం కలగదనే నమ్మకం కుదిరిపోయింది. ఏడ్గురు కుమార్తెలను చంపడానికి నిర్ణయించుకుంది కూడ. ఆమెకీ పన్నాగంలో దాసీ వెంకటలక్ష్మి తోడ్పడుతూంది.

ఢిల్లీలో జమాబంది లెక్కలు చూచే సమయం వచ్చింది. ఢిల్లీ చక్ర వర్తి నుండి జమాబందికి రావససిందిగా వార్త వచ్చింది. నవభోజరాజు తన వెంట ఢిల్లీకి కుమార్తె లేడ్గురునీ తీసుకొని పోవడానికి నిశ్చయించుకుని రాజు కొలువుకు పోయి వచ్చేలోపల మాణిక్యాలదేవి సవతి బిడ్డల నందరినీ చేర దీసుకుని "మీరు మీనాన్నగారి వెంట ఢిల్లీకి పోవద్దు. ఇక్కడనె యుండండి. నేను మీకు మంచి కథలు చెప్తాను. కమ్మని పిండివంటలు వండించి పెడ

తాను. మన మందరం ఆడుకుందాం. పాడుకుందాం" అని మాయమాటలు చెప్పి వారి మనసు మార్చి వేసింది. వారంతా తండ్రితో "మేము మీవెంట ఢిల్లీకి రాము— పిన్ని దగ్గరుండి ఆడుకుంటాం. మాకక్కడి నుండి రంగు బొమ్మలు పట్టుపరికిణీలు పట్టుక రండి" అని చెప్పారు. మహారాజుగారు సరే నని బిడ్డలనందరిని చినరాణిగారికి ఒప్పగించి ఢిల్లీకి పోయారు.

# పిల్లలు పడిన పడరాని పాట్లు

రాజుగారింట లేరు. రాణిగారి పెత్తనం. అమ్మాయిల బ్రతుకు లాపదల పాలయ్యాయి. ఆరోజు నిండమావశ్య. కటికి చీకటి రోజు. ఐతే మాణిక్యాల దేవి పిల్లలకో మాయమాట చెప్పింది. ఈరోజు పౌర్ణమి. సాయంత్రం దాకా మీరుపవాసాలుండి చంద్రోదయం చూచాక అన్నాలు తింటే మీకు చక్క దనాల మగలు వస్తారు. లేక పోతే ముసలివారు—కుంటివారు—గ్రుడ్డివారు లాంటి కురూపులు మీకు మగలౌతారు కనుక మీరీపూట పండ్లుతిని పాలు త్రాగండి" అని చెప్పింది. వారంతా సరే నన్నారు. ప్రొద్దు పడమటికి వాలింది. పిల్లలంతా "పిన్నీ! పిన్నీ! మేమాకలి కాగలేం. మాకు అన్నం పెట్టించు" మని అడిగారు.

చిన్నరాణి చిరబుర లాడింది. "ప్రొద్దునైతే ఒక్కపద్దు లుంటా మంటిరి. ఇప్పుడన్న మెలాగ వస్తుంది? ఈ బిందెల నిండా నీరు తోడుక

రండి. అంతలో వంటచేయించి మీకన్నం పెట్టిస్తా" నంటూ చిల్లిబిందె లిప్పించి పంపింది. ఎన్ని నీరు తోడిపోసినా బిందెలు నిండక పిల్లలు బావి దగ్గరనే సొమ్మసిలి పడిపోయారు. మనిషిగా చనిపోయినా ప్రాణిగా గాలిలో కలిసి తిరుగుతూన్న భూలక్షీదేవి చూచింది. ఆమె గుండె నిలువునా కరిగి పోయింది. కన్నతల్లిని నాకు కాలం తీరిపోయి నందున మారుతల్లి మాణిక్యాల దేవి పాల బడినందున గదా నా బిడ్డల కిన్ని కడగండ్లు వచ్చాయి అని కంట తడి బెట్టుకుంది. తన కుమార్తె లున్న చోటున అరటికాయల చెట్లు మామిడి కాయల చెట్లు కల్పించింది. రాజకుమార్తెలు లేచి కడుపు నిండా పండ్లు తిన్నారు. బిందెలలో చూడగా అంచులదాకా నీరు తొణికిస లాడుతున్నాయి. వారా బిందెల నెత్తుకుని వచ్చి పిన్ని ముందర దించారు. అది చూచి మాణి క్యాలదేవి విస్తుపోయింది.

మారుతల్లి మాయప్రేమ చూపి "అన్నాలు తినరండమ్మా" అని పిలి చింది. కమ్మని పండ్లు కడుపునిండా తిన్నాం. మాకాకలి కావడంలేదు. నిద్ర పోతా" మంటూ పిల్లలంతా పడకటింటి పోయి పండుకున్నారు. మాణిక్యాల దేవి మరో కుట్ర పన్నింది. దాసీని పిలిచి పిల్లలు నిద్రించే గదిలో నిప్పులా కుంపటి పెట్టించి ఎండు మిరపకాయలా కుంపటి మీద పోయించి తలుపులు గట్టిగ మూయండి. మిరపకాయలకోరుకా పిల్లలంతా లేచి దగ్గుతూ ఒక్కసారి "అమ్మా" అని పడిపోయారు. నాగేంద్రస్వామి యిచ్చిన వరమున్నది కనుక భూలక్ష్మీదేవి అక్కడ కక్కడనే ప్రత్యక్షమై మిరపకాయ కోరు నంతా మంచిగంధం వాసనగా మార్చివేసి మాయమయింది.

మిరపకాయల కోరలో పిల్లలంతా చనిపోయి యుంటారనుకుంది మాణిక్యాలదేవి. తెలతెలవారు వేళ దాసీని పిలిచి "గదిలోని పిల్లల శవాలను బయట వేయ" మని చెప్పింది. దాసి వెంకటలక్ష్మి తలుపు తెరచి చూచునంతలో పిల్లలేడ్గురూ గల గల లాడుతూ ఎదురు వచ్చారు. అది చూచిన చిన్నరాణిగారికి మతిపోయింది. ఈసారి గట్టి ప్రయత్నం చేసి రాజుగారు ఢిల్లీనుండి తిరిగి వచ్చేలోపల యీ పిల్లల పీడ విరగడ చేసుకుని తీరాలని తీర్మానించు కుంది.

దాసి సాయంతో చినరాణి పిల్లలేడ్గురనూ అడవిలోని పాడుబడిన గుడిలో పడవేయించి బీగం పెట్టించింది. రాజకుమార్తెలకా గుడిలో అన్నపానాదులు లేక అలిమటింపసాగారు. భూలక్ష్మిదేవి అక్కడకు పోయింది. నాలుగు కూరలు, నవకాయ పిండి వంటలతో వారి కాహారం కల్పించింది. ఢిల్లీనగరంలో పాదుషావారి విడిదిలో శయనించియున్న నవభోజరాజును వెన్నుతట్టి లేపి "ప్రభూ! నా బిడ్డలాపదలో వున్నారు. వారిని కాపాడ" మని చెప్పి యదృశ్యమయింది.

## నగరంచేరిన నవభోజరాజు

ఉలిక్కిపడి నిద్రలేచిన నవభోజరాజు గజగజలాడి పోయాడు. అప్పటికి వారం దినాల నుండి పాదుషా వారి దర్శనం కాలేదు. వచ్చిన పను లేవీ నెరవేరనూ లేదు. ఏమైనా కాని—యింటికి పోయి తీరాలనుకొన్నాడు. అక్క-

డున్న నౌకరులతో చెప్పి వడిగల గుఱ్ఱంమీద పరుగు పరుగున వచ్చి భూచక్రనగరం చేరుకున్నాడు. అంతఃపురంలో యెక్కడ చూచినా పిల్లల జాడ కనపడనందున మరింత తల్లడిల్లి పోతున్నాడు. మాణిక్యాలదేవి దగ్గరకు పోయి "పిల్లలేమైనారు?" అని గద్దించి యడిగాడు. మాణిక్యాలదేవి బులి బూచికపు దొంగయేడుపు యేడుస్తూ "అయ్యో! మహారాజా! నేనేం చెప్పేది? వాళ్ళమ్మ పెనుభూతం రూపంలో వచ్చి పిల్లల నెత్తుకుని పోయిం" దంటూ నాటక మాడింది. అమ్మగారు చెప్పిందంతా నిజమే నని దాసి సాక్ష్యం కూడ చెప్పింది.

అసలే నవభోజరాజుకా మాణిక్యాలదేవి మీద గౌరవం లేదు. అందు కనే పిల్లల నక్కడుంచడానికి యిష్టంలేక "తనవెంట ఢిల్లీకయినా తీసుక పోవా" లనుకున్నాడు. ఐతే పిల్లలే స్వయంగా మేమంతా పిన్ని దగ్గరుంటా మని చెప్పారు. కనుక సరే నన్నాడు. దానికి తగినట్లే యిపుడు పిల్లలు కన పడడం లేదు. మాణిక్యాలదేవి మీద అనుమానం బలపడి పోయింది. ఇప్పు డాయన కంతా అయోమయంగా వున్నది.

రాజసేవకులను రావించి "మీరంతా నగరం నాలుగు వైపులా వెతికి పిల్లలెక్కడ నున్నారో చూసిరండి" అని నియమించాడు. రాజసేవకు లంతట పరుగెత్తి పోయి బావులు, చెరువులు చూసుకుంటూ చుట్టు ప్రక్కల గ్రామా లకు గూడ పోయారు. కొంత సేపటికొక భటుడు తిరిగి వచ్చి "ప్రభూ ఊరి వెలుపల నున్న పాడుబడిన కోవెలలో రాజకుమార్తెలున్నారు. తలుపులు బిగంపెట్టి యున్న" వని చెప్పాడు. నవభోజరాజుకు పోయిన ప్రాణాలు

తిరిగివచ్చి నట్లనిపించింది. పరివారంతో గూడ బయలుదేరిన రాజు సేవకుడు చూపిన గుడిదగ్గరకు పోయి తాళాలు పగుల గొట్టించి నంతనే బావురు మంటూ కుమార్తె లంతా వచ్చి తండ్రి చుట్టు మూగారు. కన్నతండ్రి కడుపు తరుగక పోయింది. అందరినీ చేరదీసుకుని "మీరంద రెందుకిక్కడున్నారమ్మా" అని అడిగాడు.

వెక్కి వెక్కి యేడుస్తునే పిల్లలంతా "నాన్నా! నానా! మేము మీతో ఢిల్లీ రావడానికి ప్రయాణ మయ్యాక పిన్ని మమ్మల్ని పిలిచి "ఢిల్లీకి మీరు పోవద్దు చాలదూరముంది. అక్కడ మీతో ఆడుకునేవారు—పాడుకునే వారె వరూ వుండరు. మీరంతా యిక్కడనే యుంటె మీకు మంచి కథలు చెప్తాను. తియ్యని మిఠాయి పెట్టిస్తా" నని చెప్పినందున మేమా మాటలు నమ్మి నీవెంట రామన్నాం. మీరు పోయాక పిన్ని మమ్మల్ని పెట్టిన బాధలు బాధలు కావు. ఎవరో మాకు తెలియకుండా మమ్మల్నికాపాడు తున్నందుననే ప్రాణ గండాలు తప్పి యిప్పటిదాకా బ్రతికి యున్నా" మంటూ జరిగింది జరిగినట్లు చెప్పారు.

మహారాజుకి అంతులేని ఆగ్రహం వచ్చింది ఎవరెన్ని చెప్పినా వినకుండ అంతఃపురానికి వచ్చి మాణిక్యాలదేవిని జుట్టుపట్టి యీడ్చి "నిన్ను నరికి ఉప్పుపాతర పెడతా" నంటూ కత్తిదూసి తెగవేయబోయాడు. మాణిక్యాలదేవి కూడ "యి నాటితో నా కాయువు తీరిపోయిం" దనుకుంది. అంతలో మంత్రులు వచ్చి "ప్రభూ! స్త్రీహత్య మహాదోషం. నేరానికి తగిన దండన విధించడం మంచిది కాని, చంపడం మంచిదికా"దని మందలించారు. సరేనని

మన్నించిన మహారాజా మెనొక గదియందుండ నియమించి దినబత్యం మిచ్చే లాగా యేర్పాటులు చేశాడు.

## మైకం కమ్మిన మహారాజు

మాణిక్యాలదేవి అనుకున్నదొకటి—అయింది యింకొకటి. ఆమె ప్రయత్నమంతా విఫలం కావడమే కాకుండ తనతలకే కొరివి తెచ్చుకున్నట్లయింది. మహారాజు గారిపుడు తన మందిరానికి రావడం పూర్తిగా మానుకున్నాడు. ఎవరైనా రాజుగారి ముందర మాణిక్యాలదేవి పేరెత్తితే వారిమీద విరుచుకు పడుతున్నాడు. తనచేతి క్రింద బ్రతికే దాసీలు గూడ తన్నిపుడు "మొగుడొల్లనిముండ"యని తిట్టుకుంటున్నారు. రాచనగరంలో గడ్డిపోచకున్న విలువయినా ఆమెకులేదు. ఈపాడు బ్రతుకు బ్రతికేదాని కన్నా యేనుయ్యో గొయ్యో చూచుకొనడం మంచిదనిపించింది. ఇదంతా వివరించుతూ మాణిక్యాలదేవి తన తల్లికి తెలియచేసింది.

ఆమాట లాలకించిన భార్య "ఓసిపిచ్చిమొగమా! ఇంత మాత్రానికే ఆత్మహత్య చేసుకొనడమా? ప్రపంచంలో రెండవ పెండ్లాం మీద ప్రేమలేని పురుషుడంటూ యుండడు. ఐతేనీసవతిపిల్లలు నీయానందానికి అడ్డువస్తున్నారు ఆసవతిబిడ్డలను చంపడం నీచేతకాలేదు. పోనీ—కట్టుకున్న మగనినైనా కొం

గుకు ముడివేసుకుని ముప్పుతిప్పలు పెట్టాలికాని యిది చేతగానితనం. మగవానికి మరులు గొలిపించే మర్మం నీకు తెలియదు. దానికి నేను చెప్పినట్లు చేయి. ఇక్కడ నేను యాంత్రికులను పిలిపించి, విషయమంతావివరించిచెప్పి వారిచ్చిన విభూదిని నీకుపంపుచున్నాను. దీనిని నీటితోకలిపి యోలాగానైనా నీ పెనిమిటి మీద పడేలాగా చేయి. మహారాజుమీద యీ మంత్రజల యొక్క బొట్టు పడినాచాలు. అతగాడు నీచేతితో కీలుబొమ్మయైపోయి నీకొంగుపట్టుకొని విడిచిపెట్ట"డంటూ ఉపాయం చెప్పి పంపింది.



మాణిక్యాలదేవి జబ్బుపడినట్టు నటించింది. "మహాప్రభూ! మాఅమ్మగారు బ్రతికేలాలేరు. మిమ్ముల నొక్కసారి కడసారి చూపుచూచి ప్రాణాలొదులుతా మంటున్నారు. దయచేసి ఒక్కసారి దరిశనం ప్రసాదించండి" అన్నది. కల్లాకపటం తెలియని పిచ్చి మహారాజు దాసి మాటలు నమ్మాడు. రాణిగారి మందిరానికిపోయి ఆమె ప్రక్కనున్న వేదికమీద కూర్చుని పరామర్శించుచుండగ దాసి వేంకటలక్ష్మి మాంత్రికుడిచ్చిన విభూది కలిపిన నీరు తమలపాకుతో ముమ్మారు మహారాజు మీద చల్లింది. అంతటితో ప్రభువులవారికి మైకం కమ్మింది. మాణిక్యాలదేవి మహారాజా వారికపుడు రతీదేవిలా కనపడింది. మనసుతనవశం తప్పిపోయింది.



మాణిక్యం! నీలోని అందచందాలను నేనీ నాటికి చూడ గలిగాను. ఈ నాటినుండి నీవే నాసర్వస్వము. నీవుచేయమన్నది చేస్తాను. నిన్ను చూడకుండనేనింకక్షణముండలేను. నీవు నాదగ్గరకు ర"మ్మన్నాడు—మహారాజు. మాణిక్యాలదేవి యెత్తుపారింది. కాస్తబిగువు చూపాలనుకుంది మాణిక్యాల

దేవి." మీకు నేనెందుకు? మీయమ్మాయిల కంటే నేనెక్కువా! అని యెత్తి పొడిచింది.

రాజుగారందులకు తిరిగి "అలాగకాదు. నేటినుండినేను నిన్నే ప్రేమిస్తున్నాను. నాకు నీవేకావాలి. నీవు నన్ను గంగలో దూకమంటె దూకుతా. కాలకూటవిషం త్రాగమంటె త్రాగుతా. ఇంకా యేం చేయమంటె అదిచేస్తా. పిల్లలేకాదు నాకు రాజ్యమున్నా లేకపోయినా నీవుంటే చా"లన్నాడు.

"మీరు నన్నేదో మోసగిస్తున్నా"రన్నది మాణిక్యాలదేవి. లేదు-లేదు నీకంత నమ్మకం లేకపోతే నేను నాపిల్లలందరి మీద ప్రమాణం చేస్తాను కూడా. నామాటనమ్ము "అంటూ దగ్గరకు చేరాడు రాజు. ఐతే నీపిల్లలేగ్గురను నా ప్రేమకు బలిచేస్తారా!" అనిసూటిగ ప్రశ్నించింది రాణి. ఆమాటతో రాజుగారి నోటివెంట మాట రాకపోయినా అందుకైనా సరే నన్నట్లుగా తలాడించాడు. చిన్నరాణిగారి ముఖం చిరునవ్వుతో వికసించింది.

నవభోజరాజు మెల్లగా నామె ప్రక్కకుచేరి "ప్రేయసీ! నేనన్నమాట తప్పను. కాని యిది ప్రపంచం. వారి నిక్కడనే చంపితే లోకం మనయిద్దనీ ఆడిపోసుకుంటుంది. అందుకని పిల్లల నందరనూ మేనమామల యింటివగ్గర విడిచిపెట్టి వస్తాననిచెప్పి. అడవికి తీసుకొనిపోయి అక్కడ వారిని చంపి వస్తే మనకే గొడవా యుండ"దని యుపాయం చెప్పాడు మతి తిరిగిపోయిన మహారాజు. ఆ ఆలోచన రాణిగారికి కూడ నచ్చింది. తెలవారు జామునే రాజకుమార్తెల పానుగంటిపుర ప్రయాణానికి సన్నాహాలు జరిగినై.

# రక్షణపొందిన రాజకుమార్తెలు

భూలక్ష్మీదేవి బిడ్డలందరూ తండ్రిగారి వెంట మేనమామల యింటికి ప్రయాణ మయ్యారు. మాణిక్యాలదేవి చివరసారి గూడ పిల్లలకు విషప్రయోగం చేయాలనుకుంది. పిల్లలందరకూ వేరుశనగ విషం కలిపిన పెరుగన్నం మూటలు గట్టి యిప్పించింది. తన పెనిమిటితో మాత్రం రహస్యంగా మీరా మూటలలోని అన్నం తినకండి" అని చెప్పింది. దాని కాయన సరే నన్నాడు. నవభోజరాజు మరునాటి వేకువనందే కుమార్తె లందరనూ రథం మీద యెక్కించుకుని పాసుగంటి పురానికి ప్రయాణం సాగించాడు.

దారిలో ఒక అడవి—అడవిలో ఒక పెద్దచెట్టు—చెట్టుప్రక్క నొక మంచినీటి కుంట కనపడినై. రథం నిలుపు చేయించిన నవభోజరాజు "అమ్మాయిలూ! ఇక్కడ వనరులు బాగాకుదిరినై. మీరా చెట్టు ప్రక్కనున్న మంచినీటి కుంట దగ్గర మీ మూటలోని అన్నం తినిరండమ్మా!" అని పురమాయించాడు. వారంతా సంతోషంగా రథం దిగిపోయి మంచినీటి కుంట దగ్గర కూర్చుని మూటలు విప్పుకుంటున్నారు. అందరి కంటె చిన్నకుమార్తె బాలనాగమ్మ మూట విప్పుతూనే తనముందు వాలిన కాకిముందు నాలుగు మెతుకులు వేసింది. ఆ మెతుకులు తింటూనే గిరగిరా తిరిగి పడి చనిపోయిన కాకిని చూచి బాలనాగమ్మ బిగ్గరగ "అక్కలారా! మీరన్నాలు తినకంటే" అని కేక పెట్టింది. వారంతా వారి మూటలలోని అన్నం మెతుకులు

కాకుల ముందు వేశారు. ఆ మెతుకులు తిన్న కాకులు గూడ గిలగిల తన్ను కొని పడిపోయినై. వారంతా మూటలలోని అన్నం మెతుకులు గొయ్యి తీసి అందులో మూసివేసి, మంచినీరు త్రాగాక తిరిగి రథం దగ్గరకు పోయారు.

నవభోజరాజు మళ్ళీ కుమార్తెలను రథం మీదెక్కించుకుని ప్రయాణం సాగించాడు. సాయంత్రానికి వారింకొక చోటు చేరుకున్నారు. ఈనాటికి ప్రొద్దు గ్రుంకింది. రేపు ప్రొద్దున పానుగంటిపురం చేరుకుంటాం. ఈరేయి కిక్కడ "నిద్రలు పోదాం" అన్నాడు రాజు. రథం తోలే సారథి తెచ్చి యిచ్చిన పండ్లు తిని అంతా పండుకున్నారు. ఉదయం నుండి భోజనం లేని కారణంగా రాకుమార్తెలకు నిద్రబాగానే పట్టింది. కాని రాజుగారికి మాత్రం కన్ను మూతపడలేదు. అర్ధరాత్రివేళ లేచి తను పండుకొనిన చోటునందొక కొయ్య నుంచి, సారథిని మేల్కొలుపుకుని చడిచప్పుడు కాకుండ రథమెక్కి తిరిగి భూచక్రపురానికి వెళ్ళి పోయాడు.

తెలవారింది——

రాకుమార్తెలకు మెలకువ వచ్చింది. రాజుగారు పరుండిన చోటు నం దొక కొయ్య తప్ప వారికి వారినాన్న కనపడం లేదు. రథంలేదు–సారథి లేడు. ఆ దిక్కుమాలిన యడవిలో దరిదోవలు లేని ఆడపిల్లలంతా గొల్లు మన్నారు. బాలరోదనంతో అడవంతా మారుమ్రోగి పోయింది.

అదే సమయంలో ఐదుగురు రాకుమారు లక్కడకు వచ్చారు. వారి వెంట రాజ పరివారం కూడ వున్నది. "అమ్మాయిలూ! మీరెవరు? ఏవూరు మీది? మీ అమ్మా నాన్న లెవరు? మీరిక్కడి కెందుకు వచ్చారు?" అని

పరామర్శించారు. కాని రాకుమార్తెలు వివరాలేమి చెప్పకుండనే "మానాన్న మొద్దయి పోయా" డంటూ యేడ్వసాగారు. అప్పుడా రాజకుమారులలో పెద్ద వాడు తక్కినవారితో "యిప్పుడీ పిల్లలు మన కేమీ చెప్పగల పరిస్థితిలో లేరు. ఒక వారం రోజులు గడిచాక వివరాలు తెలిసికొన వచ్చును. మీరు వెంటనే యిక్కడొక యెత్తయిన మంచె నేర్పాటు చేయండి. ఆ మంచె మీద యీ యేడ్గురమ్మాయిలను చేర్చి కావలసిన అన్నపానాదు లక్కడికే అందీయండి" అని యాజ్ఞాపించాడు.

సూర్యాస్తమయం కాకపూర్వమే మంచె తయారయింది. రాకుమార్తెల నా మంచె మీద కేక్కించిన రాకుమారుడు ప్రశాంతంగా "అమ్మాయిలూ! సూర్యాస్తమయం కాగానే యిక్కడకు పులులు యెలుగులు వస్తాయి. అప్పుడు మేమెవ్వరమూ యిక్కడ నుండము. ఐనా, మంచె మీద నున్న మీకెటువంటి ప్రమాదం రాదు. మీరు మాత్రం మంచె దిగకండి. మళ్ళీ తెలవారే టప్పటికి ఆ పులులన్నీ పోయి మేము వస్తాం" అని చెప్పారు. వారు సరే నన్నారు.

## పానుగంటి ప్రభువులరాక

వారం రోజులు గడిచినై. పానుగంటి రామవర్థిరాజు వేటాడడాని కా యడవికే వచ్చాడు. రాజు సేవకు లంతా అడవి నలుమూలలూ తిరిగి జంతు

వుల్ని వేటాడారు. అప్పటికి ప్రొద్దు నడినెత్తి మీది కెక్కినందున యెండ గూడ తీవ్రమయింది. వారి కెక్కడ చూచినా పరిసరాలలో మంచినీరు కనపడ లేదు. అంతలో రామవర్ధిరాజుకో యాలోచన తట్టింది.

పది పదునైదు దినాలకు ముందుగ వంగదేశపురాజు వేటాడ వచ్చి—ముని శాపం తగిలినందున యిక్కడనే యున్నట్లు గూడ విని వున్నాడు రామ వర్ధి. అసలా వంగదేశ రాజకుమారులను పరామర్శించే తలంపుననే ఆయన యీ యడవికి వేటాడ వచ్చాడు. వంగదేశపురా జిక్కడనే నివాస ముంటు నందున వారి గుడారాలలో మంచి నీరుండక పోదు. మనమిక్కడ జలాశయం కొరకు వెతికే దానికన్న వారున్న చోటు తెలుసుకుని అక్కడకు పోవడమే మంచి దనుకొని వారిని వెదకకుంటూ పోయారు.

పానుగంటి పురం నుండి వచ్చిన రామవర్ధిరాజు తమ జాడ తెలియక తిరుగుచున్నాడన్న వార్త తెలియగానే వంగదేశపురాజు తన సేవకుల నంపించి, వారిని రప్పించి. తగిన మర్యాదలు చేసిన తరువాత "నేనీ స్థితిలో నుండగ నన్ను పరామర్శింప వచ్చినందులకు చాల సంతోషం" అని గౌర వించాడు. వర్ధిరాజుగా రంతట "సాటిరాజున కాపద సంభవించి నపు డీపాటి కుశల ప్రశ్నలు చేయుట యందంత గొప్పతనం లేదనుకుంటాను. దానికేమి గాని, మీకీ పరిస్థితి కలిగిన విధాన మేమిటో వివరించి చెప్పినవారుకా" రన్నాడు.

చెప్తాను వినండి. నెల రోజుల క్రితంగా పల్లెలోని ప్రజలు వచ్చి "ప్రభూ! అడవి మృగాలు చెలరేగి మాపొలాలలో పంటలను పాడుచేస్తున్నవి.

పచ్చిక మేయ బోయిన మా మేకలు గొర్రియలను చంపుక తింటున్నవి. ఒంటరిపాటున బయటకు పోయిన మనుషులు కూడ తిరిగిరావడం లేదు. ఆ క్రూర జంతువుల బాధ మిక్కుటమయింది. దిన మొక యుగంగా బ్రతుకు తున్నాం" అని చెప్పి వాపోయారు.

ప్రజల బాధలు తప్పించాలను కున్నాను. మంది మార్బలంతో నేనీ యడవికి వచ్చి పులులు, చిరుతలు, ఎలుగుబంట్లు, అడవి పందులు మొదలైన వానిని వేటాడి చంపాను. అప్పటికి మధ్యాహ్నమయింది. దాహ పీడనతో మేమంతా డల్సి పోయాము. ఆయా ప్రాంతాలలో నీరు దొరకక తిరిగి తిరిగి ఒక మునిని చూచాము. తపో దీక్షలోనున్న మునులను పలుకరింప రాదని నాకు తెలియును. ఐనను అవసరమైనందున పిలిచి మంచినీరున్న చోటయినా చెప్పితే చాలు" నన్నాము. ఎంతకును ముని మాటాడ లేదు. మా పరివారంలో కొందరికి కోపం రెచ్చిపోయింది. తోడి మానవుడు గొంతుక యెండి చనిపో నున్నపుడు వానికి మాటసాయం చేయలేని నీతపసెందు" కంటూ అంతకు ముందు మాచే చంపబడిన యొక పులి కళేబరాన్ని ఆయనమీద పడవేశారు.

వెంటనే ముని కనులు విప్పి చూచి "ఓయీ! రాజా! నా తపోదీక్ష భంగ పరచిందె గాక, నన్నావమానించావుగా! ప్రతిఫల మనుభవిస్తావు. చీకటి పడే వేళకు నీవు పులిగా మారిపోతావు. నీ తమ్ములు నలువురు చిరుత పులులౌతారు. నీ పరివారమంతా ఎలుగుబంట్లయి భయంకరంగా సంచరించుతూ మళ్ళీ తెల్లవారేటప్పటికి మనుష లవుతుంటా"రని శపించాడు. అపరాధం

మన్నింప ప్రార్థించా లని అనుకుంటుండగనే ఆయన మళ్ళీ కనులు మూసు కున్నాడు. మేమీయనను తిరిగి పలుకరింప లేకపోయాం.

చేసేదిలేక మేమిక యింటి దారి పట్టాం. అంతలో చీకటి పడింది. నేను పులిగ—నా తమ్ములు చిరుతలుగ—నా పరివారం యెలుగులుగా మారి పోయాం. అప్పుడేం చేశామో మాకు తెలియదు కాని మరునాటి సూర్యోదయ కాలానికి మళ్ళీ మనుషుల మయ్యాం. ఈ స్థితిలో మేమింక నగరానికి పోతే రాత్రులందు మావలన ప్రజలకు హాని కలుగుతుంది. కనుక మేమీ యడవిలోనే యుండి పోదలంచాం" అని వంగదేశపురాజు తన చరిత్ర నంతా చెప్పాడు.

# రాజకుమార్తెల వివరములు

రాజకుమార్తెలు ప్రతిదినం సుర్యోదయమయ్యాక మంచెదిగి రావడం, కాలకృత్యాలు తీర్చుకొని, స్నానాలుచేసి, వంటలు చేసుకొని భోజనాలు చేయడం, ప్రొద్దువాలిందాకా వనవిహారాలు చేయడం, చీకటి పడక ముందె రాత్రికాలపు భోజనాలు ముగించుకొని, వారికికావలసిన వానిని సర్దుకుని మంచె నెక్కి నిద్రలుపోవడం పరిపాటిగా యీవారం దినాలనుండి గడచిపోయినై.

ఇపుడీ వర్థిరాజు వంగదేశపురాజులు మాటాడుకునే సమయంలో వారక్కడనే తిరుగుచున్నారు.

ఆ పిల్లలను చూచినంతనే రామవర్థిరాజుకు తన కుమార్తె భూలక్ష్మీదేవి గుర్తుకొచ్చింది. అచ్చు గ్రుద్దినట్లు కుమార్తె మొక్కట్లు కనపడుతూన్నందున వీరంతా తన మనుమరాండ్రేమోనని పించింది. ఆయన వెంటనే "వంగరాజా! నీవు మంచివాడవు. భగవంతుడు నిన్ను కరుణింపగలడు. కాని, యీఅమ్మాయిలెవరు? అని ప్రశ్నించాడు. వంగదేశపు రాజంతట" రామవర్థిరాజా! ఈబాలిక లేగ్గురు నాకు తోబుట్టిన చెల్లెండ్రు కారుగాని, చెల్లెండ్రలాంటివారే. సంబంధం చెప్పమంటే చెప్పలేను. ఏనాటి ఋణాను బంధమో తెలియుటలేదు.

మేమీ యడవిలో నివాసస్థాన మేర్పరచుకొనడానికి వాతకుకుంటూ యిక్కడకువచ్చాం. మాకపుడీ పిల్లలు కనపడ్డారు. గోడుగోడున యేడుస్తున్నారు. మేమే దడిగినా మానాన్న మొద్దయి పోయాడని సోకాలుపెట్టడం తప్ప వివరాలు చెప్పలేరు. "ఎవరైతే నేమిలే. ప్రస్తుతం దిక్కులేనివారు. ఆడపిల్లలు. నాకు సోదరీ మణుల వంటివారు. ముందాదరించుదాం. వీరికి సంబంధించిన వారెవరైన వచ్చి నట్లయితే వారి బిడ్డలను వారికి ఒప్పగించుదా" మనుకుని రాత్రికాలములలో మేము పులుల మైనపుడు వీరికే యపకారం చేయుదుమో నను భయంబున యీ మంచె నిర్మించి వీరినీ మంచమీద నుంచి కాపాడుతున్నాం" అని చెప్పాడు.

రామవర్ధిరాజు మనసులోని అనుమానం యింకా బలపడింది. రాజా! వీరినిచూస్తూంటె నాకుమాత్రం భూలక్ష్మి బిడ్డలై యుంటారనిపిస్తుంది. తల్లి మొక్కట్లు పిల్లలలో తప్పకుండ కనుపిస్తున్నవి. పూర్తి వివరాలు తెలిసికొందామా!" అన్నాడు. వంగదేశపురాజు కూడ సంతోషించి "అంతకంటె కావలసింది మాత్రమేమున్న"దంటూ వారలను దగ్గరకు పిలిచి, స్తిమితంగ కూర్చుండ నియమించి. "అమ్మా! మీరెవరు? ఏవూరుమీది? మీఅమ్మానాన్న లెవరు? మీరిక్కడి కెందుకువచ్చారు? చెప్పండమ్మా! చెప్పండి" అంటూ బుజ్జగింపు మాటలతో అడిగారు.

అక్కచెల్లెండ్రందరిలో పెద్దదైన సూర్యనాగమ్మ మెలమెల్లగ "మాది భూచక్రపురం. మాయమ్మ పేరు భూలక్ష్మిదేవి. మానాన్న నవభోజరాజు మానాన్న మమ్మల్ని మాతాతగారియూరు పానుగంటిపురం తీసుకపోతానని ప్రయాణం చేసాడు. దారిలో చీకటిపడింది. అందుకని అందరం పండుకొని నిద్రలు పోయాం. మరునాటి తెలవారు సరికి మానాన్న మొద్దయిపోయా" డంటూనే బావురు మన్నది.

రామవర్ధిరాజా మాటలువింటూనే పిల్లలనందరినీ చేతులలోనికి తీసుకుని పసిపిల్లవానిలాగా యేడుస్తుంటే వంగరాజు హృదయం కరిగిపోయింది. అయ నను ఓదార్చి "పెద్దవారు మీరిలా వాపోవడం మంచిదికాదు. నవభోజరాజుగారి పుడు చిన్నభార్య మాణిక్యాలదేవి చేతిలో కీలుబొమ్మయి పోయాడని వింటూన్నాం. ఇకమీద యీపిల్లలకు తండ్రివైన—తాతవైన నీవేనని వూరడించాడు.

# ఏక కాలాన యేడు పెండ్లిండ్లు

పొంగివచ్చే దుఃఖాన్ని దిగమింగుకుంటున్న రామవర్ధిరాజు "నేనే మీ తాత రామవర్ధిరాజునమ్మా! భూలక్ష్మి నాకుమార్తె. మాది పానుగంటిపురం. ఏదో మాట పట్టింపులలో మీనాన్న మామీద పగబూని నందున మనకురాక పోకలు లేకపోయినై. మీయమ్మ చనిపోయినపుడు కూడ మాకు పిలుపులేదు. నేనే తల్లిలేని పిల్లలను పెంచుకుంటానని యడిగించినప్పటికి మీనాన్న మిమ్మ నాకీయలేదు. ఇంతకూ నేను ప్రాణాలతో బ్రతికుండగానే నా భూలక్ష్మి బిడ్డ లింత దిక్కుమాలిన వారై పోతారని నేనేనాడూ అనుకొనలేదు.

జరిగిందేదో జరిగి పోయింది. వంగరాజెంత కష్టంతో వున్నా మన కుపకారం చేశాడనక తప్పదు. అయనను దైవ మనుగ్రహిస్తాడు. మీరంతా నావెంట పానుగంటి పురం రండి, నాకేడ్గురు కుమారులు. వారంతా మీకు మేన మామలు. మీ యేడ్గురనూ నాయేడ్గురు కుమారుల కిచ్చి పెండ్లిండ్లు చేస్తాను. పానుగంటి పురానికి కాబోయే పట్టపురాణులు మీరే. మీకిక మీద సవతితల్లి పోరుగాని-కన్నతండ్రి బాధలు గాని వుండ" వన్నాడు.

వంగదేశపు రాజు కూడ "చెల్లాయిలూ! నేనంటె మీకు నమ్మక మున్నదనుకుంటాను. నేను చేతనై నంత వరకు మీకుపకారమే గాని అపకార మంటూ చేయను. వీరు నిజంగ మీతాత రామవర్ధిరాజు గారే. పానుగంటి పురం పోతే మీకు మేలు జరుగుతుంది. మీయన్నగా నేను మీ క్షేమం గోరి చెబుతున్నా"నని యేడ్గురక్క సెల్లెండ్రను రామవర్ధిరాజుకు వొప్పగించాడు.

మనుమరాండ్రను వెంటబెట్టుకుని రామవర్ధిరాజు నగరం చేరుకున్నాడు. భూలక్ష్మీదేవి బిడ్డలనినంతనే చూడటానికి జనులు గుంపులు గుంపులు వచ్చారు. రామవర్ధిగారి భార్య మహిరాణి గారు వచ్చి మనుమరాండ్రకు దాసీలచేత దిష్టి తీసి పోయించింది. పన్నీటి స్నానాలు చేయించి, పట్టుబట్టలు కట్టబెట్టి, పాలు పాయసాలారగింపులు చేయించి పరామర్శలు చేసింది. బంధువు లంతా వచ్చి పలుకరిస్తున్నారు. అంతఃపుర మంతా కోలాహలంగా వున్నది. వారటువంటి ఆనంద మంతవరకు అనుభవించినవారు కారు.

మేనమామ లందరకూ మేనకోడండ్రి మీద అనురాగం కలిగింది. రామవర్ధిరాజు రాజపురోహితుల వారిని కావించి లగ్నాలు పెట్టించాడు. అసలే రాజుగారింట్లో పెండ్లి. ఆపైన యేకకాలాన యేడు లగ్నాలు. ఆకాశమంత పందిరి వేయించారు. కొండలంత వేదిక లమరించారు. చెఱువులంత ముగ్గులు పెట్టించారు. ముంగిళ్ళ ముందు ముత్యాల తోరణాలు గట్టించారు. పందిళ్ళ చివరలలా మామిడాకు తోరణాలు గట్టించారు. బంధు మిత్రు లందరిని రావించారు. కవులు, గాయకులు, పండితులు, శిల్పులు, కాళాకారులంతా వచ్చారు. భాజా భజంత్రీలు మ్రోగినై. అంగరంగ వైభవాలతో యేడు పెండ్లిండ్లు యేక కాలాన జరిగినై. అష్టాది వర్ణాల వారికి అన్న సమారాధన లమరినై.

# నవభోజరాజుకు పట్టిన దుర్గతి

భూచక్రపురంలో అక్కసెల్లెండ్రు పానుగంటి పురంలో తోడి కోడండ్రయ్యారు. వర్ధిరాజ కుమారు లేడ్గురు యేడు క్రొత్త కాపురాలు పెట్టుకుని చీకుచింతలు లేకుండా హాయిగా కాలం గడుపుతున్నారు.

ఇది యిలాగుండగా అర్ధమరేయి వేళ అడవిదారిలో ఆడపిల్లలను విడిచి పెట్టి యింటికి పోయిన నవభోజరాజు గారిపుడు నవమన్మధుడయ్యాడు. ముద్దుల యిల్లాలు మాణిక్యాలదేవి గారితోడిదే లోకమంతాను. ఆయనగారి కిపుడు కూర్చున్నా నిలుచున్నా అమ్మగారి యాజ్ఞ కావాలి. కన్న కుమార్తెల నమ్మించి కరకు కిరాతకుడై నట్టడవిలో విడనాడి వచ్చిన మాణిక్యాలదేవి గారి చేతిలోని మరబొమ్మకు మంచి మర్యాదలు తెలియడం లేదు. క్రమక్రమంగ అంతఃపరిచారకులకు—కొల్వు కూటంలో పనివారలకు—గ్రామంలో ప్రజలకు గూడ రాజుగారింటి గౌరవాభిమానాలు నశించి పోయినై.

ముద్దుల భార్య ముచ్చటలతో, మురిపాలతో, విందులతో, వినోదాలతో ధనాగారంలోని డబ్బంతా తరిగి పోయింది. ప్రభుత్వానికి రావలసిన ఆదాలు రావడం లేదు. నౌకరీలు వారి బాధ్యతలను వారు నెరవేర్చుటయు లేదు. ఇంతలో ఢిల్లీ పాదుషా వారికి కప్పం చెల్లించవలసి వచ్చింది. చక్రవర్తిగారికి సొమ్ము ముట్టచెప్పలేక తటతటాయిస్తున్నాడు నవభోజరాజు.

ఆనాడు నవభోజరాజు ఢిల్లీలో వారం రోజులుండి కూడ చక్రవర్తి దర్శనానికి రాకుండానే—చెప్పకుండానే తిరిగి భూచక్రపురం పోయినందున

పాదుషావారికి కోపంగానే వున్నది. మాకు కప్పకట్టే సామంతరాజుకు మేమంటే యింత నిర్లక్ష్యమా అంటూ కేకలు వేశాడు. దానికి తగినట్లే యిపుడు ఖజానా డబ్బు తరిగి పోయినందున మరింత మండి పడ్డాడు. వెంటనే మంత్రులను పంపి నవభోజరాజు పదవినుండి తప్పించారు. చక్రవర్తికి రుణ పడి నందున రాజదంపతులు కట్టుబట్టలతో బయటకు పోవలసి వచ్చింది.

నిన్నటిదాకా మహారాజ భోగ మనుభవించిన నవభోజరాజు నేడు నిరుపేదయై కుడువుకూడు—కట్టబట్టలు లేనివాడయ్యాడు. మాణిక్యాలదేవితో గూడ చెట్టునీడకు చేరుకున్నాడు. పెట్టిననాడు తినిపోయిన వారంతా మొగం తప్పించారు. ఆయన కప్పుడు మిగిలిందల్లా మాణిక్యాలదేవి—ఆమె వెంట దారిద్ర్యంకన్న యికనేమీలేదు. పిలిచినా పలికేదిక్కు లేకుండ పోయింది.

కడుపుమంట చల్లారక భార్యాభర్త లిద్దరూ ముషికి బయలుదేరారు. సవతిబిడ్డలను రాచి రంపాన బెట్టిన రాక్షసీముండ దీనిముఖం చూడగూడదని యెక్కడి వారక్కడ తలుపులు బిగించుకుంటున్నారేకాని ఒక్కరన్న వారి జోలిలో బిచ్చం వేసిన పాపాన పోలేదు. కొందరైతే అనదలంచుకొన్న మాటలు ముఖాననే అనేశారు. మొత్తం మీద రాజదంపతులు కీనాడు మ్రింగ మెతుకు లేకపోయింది.

అందళాలెక్కిన రాజదంపతులడవికిపోయి కట్టెలు గొట్టుకొనివచ్చి అమ్ముకొన సాగారు. భూచక్రనగరం విడిచిపోయి దేశమ్మకాకు లయ్యారు. కొద్దిరోజులు గడిచాక వారికదే జీవనోపాధి అయింది. ఈవూరు కాదు ఆవూ రంటు—అవూరు కాదు యీ వూరంటూ చల్లచల్లగా కొన్నాళ్ళకు పానుగంటి పురం చేరుకున్నారు. అక్కడ వారికి బేరం బాగా సాగుతూంది.

అది పానుగంటిపురమనినంతనే నవభోజరాజు గుండె గుభలుమంది. ఐతే వారికక్కడ వసతులన్ని కుదిరినందున యింకొకవూరికి పోవడం మంచి దికాదను కున్నారు. ఐనానేనిపుడీ కట్టెలమ్ముకునే వాని వేషంలో వున్నాను. నన్ను గురుతుపట్టగల వారుండరు లేమ్మని మనసు సరిపెట్టుకున్నాడు రాజు. ఆయనిపుడు మాణిక్యాలదేవితో గూడ రాజావారి సత్రం ప్రక్క మఱ్ఱిచెట్టు క్రింద చిన్నపాకలో కుండ చట్టి యేర్పరచుకొని కాలం గడుపుకుంటున్నాడు ఆలుమగ లిద్దరూ ప్రతిదినం ప్రొద్దున్నేలేచి యడవికిపోయి రెండు కట్టెల మోపులు తెచ్చుకుని చెరియొక వీధికిపోయి అమ్ముకొని ఆచెట్టుక్రిందకు చేరుకుంటున్నారు.

## అపకారుల కుపకారము

ఒకనాడు నవభోజరాజు బేరంగాక అటుపోయి ఇటుపోయి రాజావారి కోట ప్రక్క వీధిలో కట్టె లమ్మకానికి కేకలు బెట్టుతున్నాడు. అదే సమయంలో నగరం చూడవచ్చిన యువరాణులు నవభోజరాజునుచూచి "యీకట్టు లమ్మనది నాన్నగారై యుందురా!" అని మదనపడ సాగారు. చివరకా అక్కసెల్లెంద్రు గుమిగూడి వచ్చి చూచి నాన్నగారంటె నాన్నగారే ననుకున్నారు.

రాజకుమార్తెలు నాన్నాఅని పిలిచారు. ఆపిలుపువిన్న నవభోజరాజుకు ప్రాతపిలుపు వలె తోచింది. ఆయనగూడ వారివంక పరిశీలనగ చూచాడు. అవును వారంతా తన కుమార్తెలే. తాను చేసిన పనికి మొగం చెల్లక మహారాజు తలవంచుకొని లోలోపల కుమిలి పోయాడు. పానుగంటిపురపు కోడం డ్రు నవభోజుని వారివెంట రాజాంతఃపురానికి తీసుకుపోయి పరామర్శించారు. పిన్నియెక్కడున్నదని యడిగారు. తండ్రి చెప్పిన గుర్తుల ప్రకారం భటుల నుపంపించి మాణిక్యాలదేవిని గూడ రావించారు. వారిని పల్లెత్తుమాటనక యిద్దరికీ తలంటుస్నానాలు చేయించారు. రాజదుస్తులు కట్టబెట్టారు. అత్తరు పన్నీరులు చల్లించారు. సరసరాజాన్న భోజనాలతో విందులు చేయించారు. మంచి కర్పూరపు తాంబూలా లిప్పించారు. హంసతూలికా తల్పాల మీద పరుండ నియమించారు.

నవభోజరాజు వారికి పట్టిన దుర్గతి కుమార్తెలతో చెప్పకున్నాడు. మాణిక్యాలదేవి వారివంక మొగమెత్తి చూడలేకపోయింది. అంతలో వారిని చూడవచ్చిన అత్తమామలు, అల్లుండ్రంతా గౌరవించారు. కుమార్తెలు వారి నేమాత్రమూ చిన్నపుచ్చక సగౌరవంగా చూస్తున్నారు.

రామవర్ధిరాజు కుమారులలో సూర్యవర్ధిరాజ పెద్దవాడు. సూర్యవర్ధికి ఢిల్లీపాదుషా పరమ మిత్రుడు. చక్రవర్తి తనమాటనంత తేలికగా త్రోసిపుచ్చడనేనమ్మకమా సూర్యవర్ధిరాజు కున్నది. ఆయన ఢిల్లీకిపోయి చక్రవర్తితో స్వయంగా మాటాడాడు. "నవభోజరాజు మా మామగారయ్యారు. వారు ప్రభుత్వానికీయవలసిన సొమ్మంతా నేనిచ్చుచున్నాను. వారికి మరల

భూచక్రనగర పాలనాధికార మీయండి" అని కోరాడు. పాదుషా వారంతట సంతోషించి నవభోజరాజుకే తిరిగి భూచక్రపాలనాధికార మిచ్చారు.

తన వలన నానా నరక యాతనల పాలైన సవతికుమార్తెలే తమకీనాడు పోయిన రాజ్యాన్ని మళ్ళీ చేతి కందించారన్న సత్యం తెలుసుకుంది మాణిక్యాలదేవి పశ్చాత్తాప పడింది కూడాను. నవభోజరాజంతట మాణిక్యాల దేవి తోడను, తన కుమార్తె లేడ్గురు - అల్లుండ్రేడ్గురు—వియ్యంకులు వీప రాలుతో గూడ భూచక్రనగరం వెళ్ళి మరల సింహాసన మెక్కాడు. అంతకు ముందు వారిని చూచి తొలగిపోయిన వారంతా తిరిగివచ్చి పాదా లాశ్రయించారు. నవభోజరాజు బంధువుల నందరినీ కొన్ని రోజు లుంచుకున్నాక వారికి బహుమతు లిచ్చాడు. కూతురల్లుండ్రకు కట్నాలు సమర్పించాడు. వియ్యంకులను గూడ ఘనంగా సత్కరించి పంపాడు. ఎవరి రాజ్యాలు వారు సుఖంగా పాలించు కుంటున్నారు.

# గండికోట యుద్ధము

పానుగంటి ప్రభువులకు మొదటి నుండి గండికోట రాజు లాత్మీయులు. ఒకరి కేదయినా యిబ్బంది వస్తే మరొకరు చూచి సహింపరు. ఇప్పుడా గండికోట రాజు మీదికి పరరాజులు దండెత్తి వచ్చారు. ఎదుటివారు బలవంతులైనందున యుద్ధం భయంకర మయ్యే సూచనలు కనపడుతున్నవి. గండి

కోట ప్రభువులు పానుగంటి ప్రభువుల సాయం కోరారు. వర్ధిరాజ కుమారు లేడ్గురూ మీకు తోడు వస్తామని మాట యిచ్చారు. ఆడిన మాట మేరకు పెద్ద వారార్వురను ముప్పురు మంత్రులను యిరవై వేలమంది సైన్యమును వెంట బెట్టుకుని యుద్ధానికి తరలి పోయారు.

కడగొట్టు కోడలు బాలనాగమ్మ గర్భవతి. అక్కలార్వురకు సంతానం లేదు. బాలనాగమ్మంటే తోడుకోడండ్రందరకు పంచప్రాణాలు. ఆమె భర్త కార్యవర్ధిరాజు. ఆయన గూడా యుద్ధానికి పోవలసిన వాడే కాని నిండు చూలాలైన భార్యను విడనాడి వెళ్ళాలంటె అడుగు ముందు పడటం లేదు. ఏవేవో అనుమానా లాయనను విడనాడడం లేదు. ఎందుకయినా మంచిది ఒకసారి భార్యను పలుకరించి పోదామని బాలనాగమ్మ మందిరానికి వచ్చాడు.

బాలనాగమ్మ వీరపత్ని—వీరమాత కాబోతూంది కూడ. పెనిమిటి పడుతూన్న సంకటాని కామె విస్తుపోయింది. "ప్రభూ రాచబిడ్డ రణమనిన వెనుకాడ రాదు. అన్నలార్వురు యుద్ధానికి పోయినా వంటిల్లు విడిచిపోని పిరికి పంద కార్యవర్ధి భూపాలు రనే పరిహాసం నేను వినలేను. మీకు యుద్ధంలో తప్పక జయం లభిస్తుంది. అక్కలార్వురున్నారు-అత్తగారున్నారు—మంత్రసాను లున్నారు—మన పరివారక మున్నారు. మీరు తిరిగి వచ్చే లోపల నేను మగబిడ్డను కని మీకీయగలను. నిశ్చింతగ పోయిరండి" అంటూ తిలకం ముఖమున దిద్ది—కర్పూర నీరాజన మిచ్చి—వీర ఖడ్గం చేతి కందించింది.

సరేనని అందాకా పోయిన కార్యవర్ధిరాజు తిరిగి వెనుకకు వచ్చి "బాలా! అన్నట్టు నీకు చెప్పవలయు నని వచ్చినమాట చెప్ప మరచాను.

మనకు కొంతదూరంలో మాయల పకీరున్నాడు. వాడు చాల బలవంతుడే గాక పరమ దుర్మార్గుడు. మంత్రాలు మాయలలో తిరుగు లేని చేయి. స్త్రీలను మోసగించి యెత్తుకొని పోవటంలో గడిదీరిన మెనగాడు. ఏసమయ మెటు లుంటుందో చెప్పలేము. మేమంతా కోట విడిచి పోతున్నాం. మీరు జాగ్రతగా వుండడ మెందులకైనా మంచిది." అంటూ ఆంక్ష పెట్టాడు.

రాణివాస భవన ద్వారానికి ముందుగ మూడు గీట్లు గీచి "బాలా! ఎవరైనరాని—ఏ యవసర మైనరాని మన పానుగంటి పురీశ్వరుని సాక్షిగసూర్య చంద్రాదులు సాక్షిగ—భూమ్యాకాశములు సాక్షిగ—ముప్పది మూడు కోట్ల దేవతల సాక్షిగ—చివరకు నా సాక్షిగా కూడ నీవీ గీటు దాటి రారా" దని శాసించాడు. "మీరు చెప్పినట్లే చేస్తా" నని బాలనాగమ్మ తల వంచింది. వెనువెంటనే కార్యవర్ధి తన గుర్రానెక్కి పరుగున బోయి అన్నలను కలుసుకున్నాడు. వారంతా గండికోట యుద్ధానికి పోయారు.

## మాయల పకీరు మంత్రాల కోట

పానుగంటి నగరానికి పన్నెండు యోజనాల దూరంలో. నాగళ్ళపూడి గట్టుంది. గట్టుమీద కోటుంది. కోటలో పన్నెండు స్థంభాల మండప ముంది. మండపం ప్రక్క మసీదుంది! మసీదు నంటుకొని భవనముంది. కోటగోడ లోపలనే పసిడికొట్లు పది—వెండికొట్లైదు ధనపుకొట్లు యిరవై అయి

దున్నాయి. అందులో వున్నాడు మాయలపకీరు. అతని పేరు చెబితేనే చుట్టు ప్రక్కల గ్రామాలవారికి నిద్రపట్టదు. వాని చేతబడిన వారింత వరకు తప్పించుకుని వచ్చిన వారంటూ లేరు.

గండభేరుండ పక్షుల్ని చంపి వారిరక్తంలో ముమ్మారులు స్నానం చేశాడు. కంటిలో కదురు గ్రుచ్చుకుని నాల్కలో నారసం వేసుకుని చిఱు కత్తుల మీద శిరసు మోపి తల్లక్రిందులుగా నూరేండ్లు ఘోరతపసు చేశాడు. కన్యపిల్లలను తెచ్చి కాళికముందు బలి యిచ్చాడు. తంత్రం మంత్రం సంపాదించాడు. మహిమలతో నిండిన మంత్రదండాన్ని సంపాదించాడు. అతగాని కొలువులో మూడువందల ముక్కిడి దయ్యాలు. ఏడు వందల యెఱ్ఱదయ్యాలు, పదివందల పాపిదయ్యాలు పిలిస్తే పనులు తుంపై పూజా మందిరంలోని అస్థి పంజరాలకు, తల పుఱ్ఱెలకు లెక్కలేదు. ప్రతిరోజు పకీరా భూతాలకు మూడు పుట్ల గుగ్గిలం పొగ వేస్తాడు. ఏడు పుట్ల మాంసం పదికడవల కల్లు నైవేద్యం చెల్లిస్తుంటాడు. కాపాలి అనే శక్తి అడిగిన వానికి సమాధానం చెబుతూం టుంది. మాయల పకీరు కోటలో దేశదేశాల నన్నింటిని గొట్టి తెచ్చిపోసిన ధనరాసులు. బంగారపు రాసులు. ముత్యాల రాసులు. పగడాల రాసులు. రత్నాల రాసులెన్నో పడి మూల్గుతున్నాయ్.

గవళ్ళ సంగు మాయల పకీరుకు మనసిచ్చిన ప్రియురాలు. సంగు అందమైన అమ్మాయి. ఆటపాటలలో అందె వేసిన చేయి. పెండ్లాడక పోయినా పెండ్లంలాగనే పెత్తనం చలాయిస్తూంది. పకీరు కోటలో తానాడిన దాట పాడినది పాట. ప్రపంచాని కంతా తానొక్కతియే చక్కదనాల చుక్క

నని సంగభిప్రాయం. తనెంత యిదిలించినా పకీరు తన కొంగు విడువడనే గర్వం.

కోరినచీరే కట్టింది. కోరిన రవిక తొడిగింది. కోరిన సొమ్ము పెట్టింది. కోరిన తిండి తిన్నది. సంగు కావాలంటే చాలు పకీరు కొండమీది కోతినైనా తెచ్చి యిచ్చేవాడు. కాసుల పేరులు చేయించి కనకాభిషేకాలు చేయించేవాడు. తల దువ్వడానికి దాసి, జడలల్లడానికి దాసి, పూలు పెట్టడానికి దాసి, ఊలు చుట్టడానికి దాసి యెటు చూచినా దాసీల మయం. నోరు తెరచి యడగాలే కాని వరహాల వాన కురిపించేవాడు. ఏడంతస్తుల మేడ గట్టించి ఏడువారాల సొమ్ములు చేయించి రాణివాసంలో రామ చిలుకను చేసియుండే వాడు. కాని అదేమి జరుగలేదు. అమితగర్వంతో అతనినే అనరాని మాట లనసాగింది.

ఒకనాడు వారిద్దరికీ మాటలు పెరిగినై "సంగూ! నీవందమైనదానవే కాదనుటలేదు. కాని యిది ప్రపంచం. ఒకరిని మించిన వారు యింకొకరుండ కపోరు. నీకన్న అందమైన వారుండవచ్చు ఉంటేవుండనీయ్. నీవు మాత్ర మంత పొంగిపడడం మంచిదికా"దని పకీరు మొదట సబబుగానే చెప్పాడు. మదించిన వారికి మంచిమాటలు రుచింపవు కనుక "నాకన్న సుందరాంగులు లేరంటే లే"రని పైకిచూచింది సంగు పెంకితనంగా. "ఉన్నారు" అన్నాడు పకీరు కొంచెం హాందాతన ముట్టిపడేలాగా. "ఉంటెచూపరాదా! ఎవరో చెప్ప రాదా!" అన్నది సంగు మొదటి కన్న మించిన కొంటెతనంగ.

చురచుర చూచాడు పకీరు,

ఎగతాళి చేసింది సంగు.

అంజని వేశాడు పకీరు. కాపాలిని పిలిచాడు. ప్రపంచలోకల్లా అందాల బాలయెవరు? ఎక్కడుందో చూపు మన్నాడు. "పకీరూ! ఇక్కడకు తూర్పున పన్నెండామడల దూరంలో పానుగంటిపురమున్నది. పానుగంటి ప్రభువు లేడ్గురు. అందరికంటె చిన్నవాడు కార్యవర్థిరాజు. కార్యవర్థిరాజు బాలనాగమ్మ చూడ చక్కదనాలబొమ్మ. రతీదేవి బాలనాగమ్మ ముందు బలాదూర్. ఆమె మహాపతివ్రత. బాలనాగమ్మను చూడాలంటే అంజనిలో చూడండి" అని చూపింది. సంగు పకీరు లిద్దరూ బాలనాగమ్మను చూచారు. సంగు మొగం మాడిపోయింది—పకీరు మనసు పొంగిపోయింది.

# పానుగంటి పుర ప్రయాణము

బాలనాగమ్మను అంజనిలో చూచినప్పటి నుండి పకీరు కన్నుమూసినా తెరచినా ఆమె కనబడుతూంది. ఆమె మాటవినబడుతూంది. మమకారం హెచ్చి మనసు స్వాధీనం తప్పింది. అతని వాలకమంతా చూచి సంగు కనుమానం కలిగింది. "పకీరూ! వెనుకటిలా నాతో మాటాడడం లేదు. నా సకు రావడమూ లేదు. నాతో మనసిచ్చి మసల డసలే మానుకున్నావు. మకని? ఏం జరిగింది?" అని అడిగింది సంగు.

చేరవచ్చిన సంగును చీదరించుకున్నాడు పకీరు. "సంగూ! నీవు ముసలిదాన వయ్యావు. నీమీద నాకు మోజు తప్పిపోయింది. రంగులు పోయిన ప్రాత బొమ్మవు. బ్రతికినంత కాలం నీతో నేనాడుకోలేను. క్రొత్తరుచుల మీద కోరికలు పుట్టినై. అనుభవించడానికి మన సారాట పడుతూంది. నేనా పానుగంటి పట్నం పోయి బాలనాగమ్మనే బంధించుకుని వచ్చి నాజీవిత మింక స్వర్గమయం చేసుకో బోతున్నాను. నీవింక పోయి విశ్రాంతి తీసుకో" అన్నాడు.

ఆ మాటలు వింటూనే సంగు మోడువారిన మ్రానులా నిలబడి పోయింది. "పకీరూ! ఏమంటున్నావ్? బాలనాగమ్మ మీదనే భ్రాంతి పెట్టు కున్నావా! ఆమె మహాపతివ్రత. ఆమె భర్తా బావలంతా వీరాధివీరులు నిప్పును ముట్టుకుంటె కాలకుండ మానదు. సాధ్వీమతల్లులు శపించితే సర్వ నాశనం గాక తప్పదు. అందని మ్రానిపండ్లకై అఱ్ఱులు చాచడం అనర్థ హేతువు. నిన్ను నమ్మకున్న దానను—నీవే నాపతి గతి వనుకొనిన దానను— నీకై జీవితార్పణం చేయగల దానను—నిన్ను సుఖపెట్టడానికి నేనున్నాను. నీవా బాలనాగమ్మ మాట మరచిపో. నీకు సుఖముంటుంది—నాకు సంతోష మవుతుం" దని హితోపదేశం చేసింది.

పకపకా నవ్వాడు పకీరు. సంగూ! మాయల పకీరు మంత్ర దండం ముందు పానుగంటి ప్రభువుల బలమెంత? ఒకనాడు నీవూ పతివ్రతవే నను కుంటాను. నాచేతికి చిక్కినాక నీపాతివ్రత్య మేమయిందంటావు? యిప్పుడే మంటున్నావు? అంతే. పకీరు చేతిలో పట్టుబడ్డాక- తప్పించుక పోయే దారి

కనపడక పోయాక—ఎంతవారయినా గంతమోయక తప్పేదేముంది? నీబెది రింపు మాటలతో నా ప్రయత్నం తప్పించ లేవు. నీమీద నాకున్న మమ కారం తప్పిపోయింది. నీవింక నాకక్కర లేదు. ఐనా నీజీవనానికి లోపం కలిగించను. నీవింక పోయి నీమోకాని పేటలోనే ఒక మూలన పడియుండు" మని గద్దించాడు.

సమాధానం చెప్పలేని సంగు ప్రక్కకు తప్పుకుంది.

బాలనాగమ్మను బంధించుకుని వచ్చే మార్గ మాలోచించాడు పకీరు. కాపాలి స్వయంగ "పకీరూ! పతివ్రతల జోలికి పోవద్దు. పానుగంటి పట్ట ణపు రాణి శపించిందంటె నీవు నీమహలు నీమంత్రదండం కూడా మాడిపోవ డంలో సందేహం లేదు. కోరి చేతులారా నీ మరణాన్ని నీవే కొనితెచ్చు కొనకు" మని చెప్పింది. పకీరు యింకోసారి వికటాట్టహాసం చేశాడు. "కాపాలీ! నాకు మరణమంటున్నావా! ఆ మృత్యు వింకా బ్రతికే యున్న దంటున్నావా? పకీరు కోట కది పదామడల దూరాన పారిపోయింది కదూ? నేనేనాడో మరణాన్ని జయించాను. పకీరుకు చావులేదు. పకీరమరత్వం పొందా డని తెలియదా? బాలనాగమ్మనే కాదు—పానుగంటి పురాన్నే పట్టి తీసుక వస్తాడీ ఫకీర్. నాకు పరాజయం లేదు. చూడు నాతడాకా" అని వెన్ను విరి చాడు.

తిధి వారం నక్షత్రం చూచుకుని వర్జంలేని సమయంలో పానుగంటి పురానికి బయలుదేరిన పకీరుకు గుమ్మంలోనే చెవులపిల్లి యెదురయింది. వెను కకు వచ్చి కొంచెం సేపు కూర్చుని మళ్ళీ బయలుదేరిన పకీరుకు మసీదు

దగ్గర నాగుబాము యెదురై పడగెత్తి బుసగొట్టింది. శకునం బాగులేదని లోప లకు పోయి కాస్త మద్యం త్రాగి మూడవమారు బయలుదేరిన పకీరు కోట గుమ్మం దాటుతుండగ తంబళ్ళపెద్ది యెదురొచ్చింది. ఆనాటికి పకీరు ప్రయాణ మాగిపోయింది.

పకీరుకా రేయి నిద్ర పట్టలేదు.

మరునాడు గంపెడు చీకటుండగనే లేచి జంగందేవర వేషం వేశాడు పకీరు. జోలినిండ మంత్రించిన విభూది నింపుకున్నాడు. మంత్రదండం చేత పట్టుకున్నాడు. తలెత్తి చూడకుండ దారిపట్టి పానుగంటిపురం చేరుకున్నాడు. శంఖం పూరించి భూం భూం అంటూ రాజవీధిలో పిల్లల నందరినీ చేర పిలి చాడు. వింతలు చూపుతూ, వినోదాలు చేస్తూ సందడి సందడిగా తిరుగుతూ రాజుగారి కోటను సమీపించాడు.

# పానుగంటి కోట కేతెంచిన పకీరు

పానుగంటి కోట ముఖద్వార పాలకుడు కొత్వాలు రామసింగ్. రామ సింగ్ ప్రభువుల కమిత విశ్వాస పాత్రుడు, జంగందేవరను చూడగనే లేచి నిలువంబడి "దండాలు స్వామీ! దండాలు. ప్రభువు లంతా కోటలో లేని సమ యం. వారు గండికోట యుద్ధానికి పోయారు" రాం సింగూ! రామసింగూ!

మేమింట లేనపుడు అతిధులు వచ్చినా, అభ్యాగతులు వచ్చినా, కవులు వచ్చినా, బ్రాహ్మణులు వచ్చినా జంగందేవరలు వచ్చినా కాదు పొమ్మన కుండా వరహా డబ్బులు మానెడు బియ్యమిచ్చి పంపించుమని మాకాజ్ఞ యిచ్చారు. కనుక మీ సంభావన మీరు పుచ్చుకొని పోయి ప్రభువులు తిరిగి వచ్చాక దయచేయండి” అంటూ చేతులు జోడించాడు.

ఆ మాటలకు ముసిముసి నవ్వులు నవ్విన జంగందేవర “నాయనా! రామసింగ్! కాశీయాత్ర పోతున్న బసవేశ్వరులం. మీరు రమ్మంటే వచ్చే వారము కాదు — పొమ్మంటే పోయేవారమూ కాము. పరమేశ్వరుని సంకల్ప మైతేనే మేమెక్కడికైనా పయనిస్తుంటాం. సేవకుల చేతి భిక్ష స్వీకరింపరాదని యీశ్వరాజ్ఞ. మహారాణి గారల చేతి భిక్షతో మరలిపోకుండా మేమీ కోటలో రోజులుంటామా! వారాలుంటామా! మాకంతరాయం చెప్పడం మీకే మంచిది కాదోయ్” అన్నాడు.

కొత్వాలు రామసింగ్ మంచి సంకటంలో పడ్డాడు. “స్వామీ మీ మాటలు వింటూంటే కోటలోనికి పంపాలనిపిస్తుంది. మాకు మాహారాజాజ్ఞచూస్తే పంపడానికి వీలులేదు. ఏదైనా నేను రాజసేవకుడును. స్వతంత్రాధికారం నాకు లేదు. మీరీ సమయంలో నన్ను మొగమాటపెట్టక నాయందు దయయుంచి యిప్పటికిపోయి యింకొకసారి దయచేయండి” అన్నాడు.

పకీరుమెత్తు పాతేలాగాలేదు. ఐనా అంతతేలికగా విడిచిపెట్టి పోయే కంకాదు. ఆలోచన మూర్ఖాలనుకున్నాడు. “నాయనా! కొత్వాలు! నీకు సంతానం లేక చింత బడుతున్నావు కదూ? అందుకే రెండు పెండ్లిండ్లు గట్టు

షన్నా అయ్యా అనిపిలిచే బిడ్డల్ని కనలేకపోతున్నావు. ఔను. బసవేశ్వరుల వారి ననుమానించిన పాపఫల మనుభవింపక తప్పిపోతుందటయ్యా! మరల యీజన్మగూడ మహేశ్వరులవారి మాట తప్పుతున్నావే—ముందు వచ్చే యేడుజన్మలలో గూడ నీకు సంతాన ప్రాప్తి ముండదోయి! నీకర్మకు నేనేం చేయగలను! వస్తానంటూ వెనకకు మరలాడు మాయజంగందేవర.

కొత్వాలుకు తల తిరిగిపోయింది. స్వామీ! అంటూ పాదాల మీద పడ్డాడు. పకీరు ముసిముసి నవ్వులు నవ్వుతూ "ఏం? సంతానం కావాలనా! కావాలంటే చేయిబట్టు. ఇల్లునిండిన మంతాన మిస్తా" నన్నాడు.

కొత్వాలుకు నిజంగానే సంతానంలేదు. పెండ్లాలతో యేగలేక పోతు న్నాడు కూడ. జంగందేవర జరిగింది జరిగినట్లుగా చెప్పినందున ఆయన నిజంగా దేవుడే ననుకున్నాడు. "ప్రసాదించండి స్వామీ!" అంటూ దోసిలి పట్టాడు. మాయ జంగందేవర కొత్వాలుచేతిలో విభూదినుంచి "చూడు రాంసింగ్! నీవింటికిపోయి నీ యిద్దరి భార్యల ముఖాల మీద పెట్టి నోటిలో కాస్తకాస్త వేయి. నీవూ బొట్టు పెట్టుకుని నోటిలో వేసుకో. మిగిలిన దానిని నీయింట్లో నాలుగు మూలలా చల్లు. ఏడు గడియలలోనే నీయిల్లు నిండిన పిల్లలు పుట్టకపోతే ఒట్టు బెట్టు" అన్నాడు.

కొత్వాలు సంతోషంతో పొంగి పోయాడు. స్వామి! నాకైతే తమ సత్తా తెలిసింది. నేను మిమ్ములను లోపలకు పంపుతున్నాను. మాపానగంటి పురం కోట కేడు ద్వారాలు, ఏడు దర్వాజాల వద్ద కాపలావారు లున్నారు. రెండవ ద్వారం చెంత పెద్ద పులుల కాపలా, మూడవద్వారం చెంత యెలుగు

బంట్ల కాపలా, నాల్గవ ద్వారం చెంత వేటకుక్కల కాపలా, ఐదవ ద్వారం చెంత మదపుటావుల కాపలా, ఆరవ ద్వారం చెంత సింహం కాపలా, ఏడవ ద్వారం చెంత విచ్చుకత్తులు చేతపుచ్చుకుని పహారా తిరిగే బొందిలీల కాపలా, తమరు జాగ్రతగా దయచేయండి" అని చెప్పి వానింటికి చేరుకున్నాడు.

# మంత్రించిన విభూతి మహత్మ్యము

ఇంటికి పోయిన కొత్వాలు తనేదో గొప్పకార్యం సాధించానన్నంత గర్వంతో యిద్దరు భార్యలను చేరపిలిచాడు. పిల్లలుపుట్టె విభూది తెచ్చాను. మీలో యెవరికి కావాలనో చేతులెత్తండి" అన్నాడు. ఇద్దరూ నాకుకావాలంటే నాకుకావాలని చేతులెత్తారు. నాకు కాళ్ళు నొచ్చుతున్నాయి. ఎవరు బాగా కాళ్ళు పట్టితే నేనీ విభూతి వారికిస్తానన్నాడు కొత్వాలు. భార్య లిద్దరూ చెరి యొకకాలు పట్టుకొని చాలనేదాకా పిసికారు. మూడోసారి కొత్వాలు నాకీనాడు డెవరు పాయసం వండిపెట్టితే నేనీ విభూది వారికిస్తానన్నాడు. ఇద్దరూ పాయసం వండిపెట్టారు.

కొత్వాలంతట "మీరిద్దరూ నేనుచెప్పిన పనులన్నీ చేశారు. కనుక నేనీ పిల్లలు పుట్టే విభూది యీయడం ధర్మ"మంటూ వారిద్దరి ముఖాలబెట్టి తననోట్టనింత బెట్టుకున్నాడు. అందరా విభూతి నాలుకలమీద వేసుకున్నారు. మిగిలిన దానిని యింటినిండా చల్లారు తరువాత యిద్దరి భార్యలను చెరియొక

ప్రక్కనా కుర్చుండ బెట్టుకొని తనకా విభూది నిచ్చిన జంగందేవరను గురించి, ఆయన గొప్పతనం గురించి చెప్పుతున్నాడు. ఇంతలో యేడు గడియలు పూర్తయ్యాయి. ఉన్నట్టుగావుండి ఒక్కపెట్టున "అమ్మోయ్! నాన్నోయ్" అనే పిలుపులు వినబడినై. వారు ముప్వురూ తలెత్తిచూచేలోప లనే యింటినిండా పిల్లలు కొల్లలు కొల్లలుగా పుట్టుకొస్తున్నారు.

కుండలలోనుండి పిల్లలు. గూటిలోనుండి పిల్లలు. తలుపులోనుండి పిల్లలు—మలుపులోనుండి పిల్లలు—పీటలలోనుండి పిల్లలు అటుచూస్తేపిల్లలు యిటుచూస్తే పిల్లలు— కదిలితే పిల్లలు—మెదిలితె పిల్లలు. పిల్లలంటే పిల్లలు కొల్లలు కొల్లలుగ పుట్టుకొచ్చారు. చుట్టుమూగారు. అమ్మానాన్నా అన్నారు. అన్నం పెట్టమన్నారు, నీరీయ మన్నారు. పరికిణీ చొక్కా లడిగారు. పప్పు బెల్లాలడిగారు. జుట్టుపట్టిలాగారు. మొట్టికాయలు పెట్టారు. ఆతాకిడికి తాళలేక తల్లిదండ్రులు ముగ్గురూ "పిల్లలొద్దుర బాబోయ్" అంటూ వీధిలో పడ్డారు. చేతులెత్తి వందనాలుచేశారు. ఎక్కడి పిల్లలక్కడనే మాయమయ్యారు. కొత్వాలు రామసింగు కంతా జడివాన కురిసి వెలిసి నట్లని పించింది.

పెండ్లాలిద్దరు రామసింగు మీద తారసిల్లారు. పిల్లను కనను చేతగాని వాడవు చెతగానట్లు పడుండక యీ మాయదారి సంతును మాకు పంపకం చేయడానికని విభూదిగూడ తెచ్చావా అంటూ నడుములు విరగ తన్నారు. కొత్వాలా దెబ్బతో మంచం పట్టాడు.

# మాయ జంగం చేసిన మంత్రజాలము

మాయజంగందేవర మొదటి దర్వాజాదాటి రెండవ ద్వారం దగ్గరకు పోయాడు. అక్కడ కాపలా కాయుచున్న పెద్దపులులు గాండ్రు మన్నవి. పకీరు మేకలను కల్పించి పులుల ముందు పడవేసి మూడవ దర్వాజా దగ్గరకు పోయాడు. అక్కడ కాపలా గాయుచున్న యెలుగుబంట్లు గీపెట్టినై. పకీరు పుట్టకుక్కలను కల్పించి యెలుగుబంట్ల ముందు పడవేసి నాల్గవ దర్వాజా దగ్గరకు పోయాడు. అక్కడ కాపలా గాయుచున్న వేటకుక్కలు బౌబౌ మన్నాయి. పకీరక్కడ పెరుగన్నం కల్పించి కుక్కల ముందు పడవేసి ఐదవదర్వాజా దగ్గరకు పోయాడు. అక్కడ కాపలా గాయుచున్న పోట్లెద్దులు అంకె బెట్టినై పకీరక్కడ పచ్చిగడ్డి కల్పించి కోడెల ముందు పడవేసి ఆరవ దర్వాజా దగ్గరకు పోయాడు. అక్కడ కాపలా గాయుచున్న సింహం గర్జించింది. పకీరక్కడ పగడపు తీగె కల్పించి సింహం ముందు పడవేసి యేడవ దర్వాజా దగ్గరకు పోయాడు. అక్కడ కాపలా గాయుచున్న బోంది లీలు విచ్చుకత్తులలు ఝుళిపించారు. పకీరక్కడ మాంచిసొగసైన అమ్మా యిని కల్పించి వారిముందు నాట్యం చేయిస్తూ రాణివాసం చేరుకున్నాడు:

రాణివాస భవనాలు—బాలనాగమ్మ మందిరం ముందు నిలబడిన జంగందేవర శంఖంపట్టి భూంభూం అన్నాడు. దాసి భిక్ష తీసుకొచ్చింది. జంగందేవర దాసివైపు ఉరిమిచూచాడు—హూంకరించాడు. ఏమిటి యీ

అహంకారం? బసవేశ్వరస్వామి భిక్షకు వస్తే దాసిచేత దాన మిప్పించి దైవా పరాధం చేయడమా? పరాభవించితే పరమేశ్వరుడు సహింపడు. మహారాణి స్వయంగ వచ్చి భిక్షయీయకపోతే స్వీకరింప మని చెప్పు. పో" అన్నాడు.

దాసి లోపలకు పోయి వచ్చి "స్వామీ! అమ్మగారు ప్రసవించి యీ నాటికేడు దినాలయింది. పురిటిబాలుడు పోరు పెట్టుతున్నాడు. మహారాణీగారు రానవకాశం లేక పోయింది. మన్నించమని మహేశ్వరుల వారిని వేడుకుంటూ యీభిక్ష వారే పంపించారు. దయచేసి స్వీకరించండి" అని సవినయంగ చెప్పుకుంది.

జాలిపడని జంగందేవర మరికాస్త మండిపడ్డాడు. "దాసీదాని చేత భిక్ష పుచ్చుకని మావ్రతభంగం చేసుకొన మంటున్నావా? ఎన్ని పనులున్నసరే యింటికైన యిల్లాలిచ్చిన భిక్షనే మేమందుకుంటాం, కాదంటే తిరిగిపోతాం." అనగానే దాసి భయపడుతూ "ఆమాట అమ్మగారికి చెప్తానుండండి" అంటూ లోపలకు పోయింది. స్వయంగ బాలనాగమ్మ భిక్ష యివ్వాలనుకుంది. కొడుకు యేడుపు మానడం లేదు. తనభర్త కార్యవర్థిరాజు యింతకు ముందొ కప్పుడు తన వ్రేలినుంచిన ముద్దుటుంగరం తీసి పురిటిబాలుని చేతికిచ్చింది. దాసి చేతిలోని కానుకల పళ్లెం తనచేతులలోనికి తీసుకొని వచ్చి గుమ్మం చెంత నిలిచి "స్వామీ! ఇది నాభర్త గీచినగీటు. దీనిని దాటరాదని ప్రభువుల వారి యాన. నేనింక వెలుపలకు రారాదు. దయయుంచి తమరిలాగ సమీ పించి యీ భిక్ష నందుకొనండి" అన్నది.

బాలనాగమ్మ అందచందాలు స్వయంగా చూచాడు పకీరు. అతని మన సులో అంతులేని ఆలోచనలు పరుగులెత్తినై. క్షణంసేపు తన్నుతాను మరచి

పోయి శిలాప్రతిమలా నిలబడి పోయాడు. పోరుపెట్టి యేకుస్తూన్న కొడుకు దగ్గరకు పోవాలను కుంటున్న బాలనాగమ్మకీ కపట బిచ్చగాని కలుషం తెలియదు. "దయచేయండి స్వామీ!" అన్నది.

ఆ మాటతో పకీరు మళ్ళీతేరు కున్నాడు. నీభర్త నీకు మాత్రమే ప్రభువు. కాకపోతే యీ పానుగంటి పురానికి ప్రభువు. మేమీ ప్రపంచానికే పాలకులం. నీకు బసవేశ్వరుని మీద భక్తి యుంటె—కలిగిన సంతానం కల కాలం నిలిచుండాలంటె. గండికోట యుద్ధానికి పోయిన నీపెనిమిటి నీబావలార్వురు క్షేమంగా తిరిగి రావాలనుకుంటె నీవాగీటుదాటి వచ్చి భిక్షనందించు మేము నిలుచున్న చోటునుండి అడుగుకదపం నీవువస్తావా! నన్ను తిరిగి పొమ్మంటావా!" అని గంభీరం తగ్గకుండా అన్నాడు.

పెనిమిటికి బావలకు యుద్ధంలో విజయం కలగలని పుట్టిన కుమారుడు పెరిగి పెద్దవాడై ప్రయోజకుడు కావాలని భ్రాంతి చెందిన బాలనాగమ్మ మాయ జంగం మర్మం తెలియక గీటు దాటి వచ్చి భిక్షపెట్టుతూండగ పకీరు మంత్రదండం బాలనాగమ్మ తల మీదుంచాడు. వెంటనే బాలనాగమ్మ నల్ల కుక్కగ మారిపోయింది. పారిపోవ ప్రయత్నించిన నల్లకుక్క నా జంగం దేవర పట్టుకుని త్రాటితో కట్టి తనవెంట మహలుకు తీసుకుని పోయాడు.

బాలనాగమ్మ కనపడ నందున అక్కలార్వురు పరిచారకు లంతా వెతుకసాగారు. తహతహలాడి పోయారు. చివరకు మాయల పకీరు మోసం చేశాడని తెలుసుకున్నారు—ఇప్పుడింక వాళ్ళు చేయగలిగిందేమీ లేకపోయింది.

# బాలనాగమ్మ బందిఖానా

బాలనాగమ్మను తీసుక వస్తాను చూడు మని పకీరు ప్రజ్ఞ—నీవు తీసుక రాలే వంటే తీసుక రాలేవని సంగు పంతం. పానుగంటి పురం పోయిన పకీరు రాకకోసం యెదురు చూపులు చూచింది. నల్లకుక్కను వెంటబెట్టుకుని వచ్చిన పకీరును చూచి పక్కున నవ్వింది. "మాయల పకీరూ! బాలనాగమ్మ నీకు దొరకదని చెప్పిన నామాటలు నమ్మావు కావు. జంగందేవర వేషం వేశావు- జబర్దస్తీ చూపావు. పానుగంటి పురం పోయావు—పరాభవం చెంది వచ్చావు. నల్లకుక్కను పట్టుకొచ్చావు—నాగమ్మనే తెచ్చా నంటున్నావు. చూడూ! గమళ్ళ సంగున్న స్థానం గజ్జికుక్కల పాలుచేస్తావా పకీర్?" అని గేలి చేసింది.

హుంకాపీల్చిన పకీరు హుందాతనంగా "నీ పొంగంతా అయిందా సంగూ!" అన్నాడు. సంగు కోపంతో "నీపొంగే కృంగింది పకీర్" అన్నది వెంటనే పకీరు తన మంత్రదండం కుక్క తలమీదుంచాడు. కుక్క బాలనాగ మ్మగా మారింది. పకీరు మహలు చూచి—పకీరు వేషం చూచి కలవర పడింది. వేటగాని చేతిలో చిక్కుబడిన కుందేలులా బెదరు చూపులు చూస్తూంది. సంగు కల్పించుకుని "ఎంతపని చేశావు దుర్మార్గుడా!" అన్నది. "నోర్ముయ్" అని సంగును గద్దించిన పకీర్ ప్రశాంతంగ "భయపడకు బాలనాగమ్మా! ఈ **మహలు** నీకు క్రొత్తచోటు మాత్రమే కాని. పరాయిచోటు మాత్రం కాదు.

నీవంగీకరించితే నేను నీకు ప్రాణవిభుడ్ని—నిరాకరించితే కాలయముడ్ని. ఇక నీ యిష్ట" మన్నాడు.

బాలనాగమ్మ "నేనిపు డెక్కడున్నాను" అన్నది.

నా దగ్గరనే వున్నావు. నాపేరు మాయలపకిర్. ఇది పకీరు మహలు. మాయాజ్ఞ లేనిదే యీకోటలోనికి పోతుటీగె కూడ దూరలేదు. ఒకవేళ వస్తే ప్రాణాలతో తిరిగి పోలేదు. అంజనిలో నిన్ను చూచాను—నీ అంద చందాలకు ముగ్ధుడ నయ్యాను. పకిరు కెదురులేదు కనుక పానుగంటి పురానికి వచ్చాను-ప్రాణగండాలనే గడిచాను. నిన్ను మోసగించి తెచ్చాను. నీవిక్కడ నుండి తప్పించుకొని పోవడం జరిగే పనికాదు. బాలా! నీ భర్తగాని, బావలను గాని యిక్కడకు రాలేరు—నన్ను జయించి నిన్ను విడిపించుకుని పోలేరు. నీవింక నీ పాత కథంతా మరచిపో. క్రొత్త జీవిత రంగంలో ప్రవేశించు. నన్ను పెండ్లాడి సుఖంగా వుండు. అంతకన్న నీకు గత్యంతరం లేదు. కాదంటావా బ్రతికినంత కాలం బందిఖానాలో పడి క్రుళ్ళిక్రుళ్ళి కృశించి చావవలసిందే కాని మళ్ళీ నీవా పానుగంటి పట్టణం చూచే మాట కల్ల" అని పకీరొక దండకం చదివాడు.

మహాక్రోధంతో బాలనాగమ్మ మండిపడింది. "ఓరి దుర్మార్గుడా! నీ యైశ్వర్యము నాకెందుకు?—నీ మంత్రశక్తి నన్నేం చేస్తుంది? నీ కాయువు మూడి నందుననే నన్ను తీసుక వచ్చావు. నీవు కొంతకాలం బ్రతికి బాగు

పడాలనుకుంటె నన్ను వెంటనే తీసుకపోయి నావారి దగ్గర విడిచి పెట్టు. లేదా! నీకోట, నీ మహలు, నీ మంత్ర శక్తి నీవు సమూలంగ నాశనమై పోతావు. జాగ్రత. పతివ్రతల సెరబట్టిన వాడెవడూ బాగుపడలేదని తెలిసి కొ" మ్మన్నది.

ఆ మాటలకు విరగబడి నవ్వాడు పకీరు. "వారెవా! ఏంటీ అంటావ్? నాగూ! నాకు చావు లేదే పిచ్చిదానా! నేను కత్తి బట్టను—కదనం చేయను. మంత్రదండ ప్రభావంతో మహీ తలాన్నే మాడ్చి మన్ను చేస్తానే. రాజు లైన—రంగప్పలైన పకీరు తలుచుకుంటె రాలు రప్పలుగ మారిపోక తప్పదు. కావాలనుకుంటే కోతుల్ని, కొండ ముచ్చుల్ని చేసి ఆటలాడిస్తాను. మహా పర్వతాలనే బూడిద చేస్తాను. నిండు సముద్రాల నింకిస్తాను. దయ్యాలను భూతాలను పిలిచి తైతక్క లాడిస్తాను. పనికి మాలిన వేదాంతులు చెప్పిన పాతివ్రత్యాన్ని నమ్ముకొని చేజిక్కిన యదృష్టాన్ని జారవిడచు కొనడం మంచిపని కాదు. నీ జీవిత మిక మీద నరకయాతన పాలు చేసుకుంటావో— స్వర్గ సౌఖ్య ప్రదం చేసుకుంటావో యోచించుకొ"మ్మన్నాడు.

క్షణకాలం యోచించింది బాలనాగమ్మ.

ఎదిరించటానికిది సమయం కాదని తెలుసుకుంది.

"పకీరూ! నీవింతవాడ వని నాకు తెలియదు. నాకింతవకాశ మిచ్చి నపుడు నేను మాత్రం కలిసివచ్చిన దానిని కాలదన్నుకొని పోయేదానను కాను. ఐతే ఒక్క విషయమున్నది. నాకిలాంటి యదృష్టం కలగాలనే నేనొక యిష్టకామవ్రతం పట్టాను. అది పూర్తవడానికి పదునాలుగేండ్లు గడువున్నది. గడవు లోపల నన్నెవరూ తాకరాదు. నిజంగ నీకు నామీద మమకార ముంటె యీ పదునాలుగేండ్లు నాకు గడవియ్యాలి. ఆ తరువాతనే మన వివాహం." అని అనగానే పకీరు "అమ్మో! పదునాలుగేండ్లే! సరే కానీయ్! నీవ్రతం నిరాటంకంగ నీవు పూర్తి చేసుకో." అని ఆమె నొక బందిఖానాలో నుంచి కావలసిన పదార్థాల నన్నింటిని పంపించే యేర్పాటులు చేశాడు.

## ప్రతిమలయిపోయిన పానుగంటి రాజులు

గండికోట యుద్ధానికి పోయిన కార్యవర్ధిరాజు మనసంతా యింటి మీదనే వున్నది. "బాలనాగమ్మ ప్రసవించి యుంటుంది—బాలచంద్రుని లాంటి కొడుకు పుట్టి యుంటా"డని కలలు కంటున్నాడు. "ఎపుడెపుడు యింటికి పోదామా! ఎపుడెపుడు బాలను చూస్తామా! ఎప్పుడెప్పుడు బాబు నెత్తుకొని ముద్దాడుదామా!" అని ఆరాటపడుతున్నాడు. యుద్ధంలో గండికోట రాజులకే జయం కలిగింది. యుద్ధం ముగియగానే గండికోట వారిచ్చిన బహు

మతు లందుకుని యేడ్గు రన్నదమ్ములు తిరిగి పానుగంటిపురం వచ్చి చేరు కున్నారు.

కోటంతా చిన్నబోయింది. బాలనాగమ్మ కనపడలేదు. పరిచారిక లెవరూ పలికి మాటాడడంలేదు. ఆర్గురు వదినల అనురాగాలులేవు. "ఏమిటి–ఏమిటి యిదంతా నని యడిగిన కార్యవర్థికి మాయలపకీరు చేసిన మోసం తెలిసింది. కార్యవర్థిరాజు కన్ను లెఱ్ఱబడినై. అన్న లార్వురు యుద్ధసన్నద్ధు లయ్యారు. పానుగంటి ప్రభువు లేడ్గురు మువ్వురు మంత్రులను యిరవై వేల మంది సైన్యాన్ని వెంటబెట్టుకుని మాయలపకిరు మీద యుద్ధానికి బయలుదేరి నాగళ్ళపూడి గట్టు చేరుకూన్నారు. రణభేరి మ్రోగించారు.

కోడిగ్రుడ్డంత నల్లమందు మ్రింగి, కుండలతో సారాద్రావిన పకీరు పండుకుని నిద్రపోతూ గుర్రు పెట్టుతున్నాడు. నల్లమందు మైకంలో ఒడలు తెలియని పకీరుకా రణభేరి వినబడలేదు. సేవకు లాతని చెవుల క్రింద నూరు తప్పెటలు వాయించి నిద్ర మేల్కొలిపారు. మూడు దమ్ములు హుకాక్క పీల్చినాక నన్నెందుకు నిద్రలేపారని అడిగాడు. పానుగంటి ప్రభువులు యుద్ధానికి వచ్చారని సేవకులు చెప్పారు.

పానుగంటి ప్రభువులు దండెత్తి వచ్చారంటే పకీరు శరీరం మీద చీమకుట్టిన మాత్రం కూడ చురుకు పుట్టలేదు. నిద్రకన్నులు నులుముకుంటూ లేచి కోటమీదకు వచ్చి నిలుచున్నాడు. చెరశాలలోని బాలనాగమ్మను వెంట బెట్టుకొని తన దగ్గరకు తీసుక రమ్మన్నాడు. భటులామెను తీసుక వచ్చి పకీరు ప్రక్కన నిలవబెట్టారు. చిరునవ్వుతో చిందులేస్తున్న పకీరు "బాలా! పదికాలాల పాటు బ్రతికుండలేని పానుగంటి రాజులు మామీదకి యిలా

ఆమె నోరు విప్పగానే బాలవర్ధి స్నేహితులంతా యెటువారటు పోయి తప్పుకున్నారు. బాలవర్ధి మాత్రంఆమెను సమీపించి "నరసమ్మా! పొరపాటు జరిగింది. నీకైన నష్టమంతా నేనిచ్చుకుంటాను." "పకీ రెవరు?ఏమయింది? చెప్పు" మని పట్టు బట్టాడు. ఆమె యింక తప్పుకో లేక పోయింది. ఏము న్నది నాయనా! నీవేడు రోజుల బిడ్డవై యుండగ మాయల పకీరు వచ్చి మీ యమ్మ బాలనాగమ్మను మోసం చేసి తీసుకపోయి చెరబెట్టాడు. అతనిని జయించాలని దండెత్తి పోయిన మీ తండ్రు లేడ్గు రక్కడ రాతిబొమ్మలై పడి వున్నా" రని చెప్పి తన దారిన తాను పోయింది.

సరాసరి రాజభవనానికి పోయిన బాలవర్ధిరాజు అమ్మలార్వురను చూచి "మీలో నన్ను గన్న బాలనాగమ్మ యెవరో నిజం చెప్పండి" అన్నాడు. ఆర్వురమ్మలు సమాధానం చెప్పలేక పోయారు. ఎందుకు నాయనా! అలా అడుగుతున్నావు? నీ కిపుడేం లోపం జరిగిం"దంటూ చుట్టు మూగారు. బాల వర్ధి "అదంతాకాదు. నేనడిగిన దానికి సమాధానం చెప్పండి. నిజం నేను తెలుసుకోవాలి" అన్నాడు. రాణుల కంటనీరు నిండినై. బాలవర్ధి ప్రశ్నకు సమాధానం చెప్పక తప్పక పోయింది. ఇంతలో అక్కడకు వచ్చిన కొత్వాలు రామసింగ్ జరిగినదంతా పూస గ్రుచ్చినట్లు చెప్పివేశాడు. బాలవర్ధి శరీరం పౌరుషావేలతో ఉడికి పోయింది. చివాలున లేచి నేనిదే నాగళ్ళపూడి గట్టుకు పోయి, మాయల పకీరును చంపి అమ్మను నాన్నలను వెంటబెట్టుకొని గాని తిరిగి నేనీ పానుగంటిపురం రా"నని శపథం చేశాడు.

రామసింగ్ ప్రభుభక్తి కల బంటు. రాజకుమారా! నీవు విజయం సాధించడం మాకందరకూ సంతోషమే. పకీరు కున్నది బాహు బలంకాదు. ఆయుధబలం కాదు. వాడిది మంత్ర బలం. ఆ మంత్ర బలంతోనే వాడు మానవులకు సాధ్యంకాని పనులు చేస్తున్నాడు. నీవాతనిని జయించాలంటే ఆవేశం పనికిరాదు. ఆలోచన కావాలి. ఏమాత్రం నీవు తొందరపడినా ప్రమాదం తప్పదు. ముందుగా నీవా మాయల పకీరు మర్మమేమిటో గ్రహించు. పరమేశ్వరుడు నీకు మేలు చేస్తా" డంటూ పూర్వీకుల నాటి కర వాలం తెచ్చి యిచ్చాడు.

# పులిని చంపిన బాలవర్ధిరాజు

అమ్మ లార్వురు దగ్గరా అనుమతి పొంది, నాగేశ్వరస్వామికి అను నమస్కారాలు చేసి, పానుగంటి పురీశ్వరునికి ప్రణమిల్లి ప్రయాణం సాగిం చిన బాలవర్ధిరాజు మూడు రోజులు పయనించి పులిరాజ్యం చేరాడు. నాటిరేయి పూటకూళి పెద్దమ్మ యింటికి పోయి స్నానం చేసి భోంచేసి హాయిగా నిద్ర పోయాడు.

తెలవారింది. మరినాటి ఉదయాన బాలవర్ధి "పెద్దమ్మా! రాత్రి నాకు స్నానానికి ఉప్పు నీరిచ్చావు. త్రాగడానికి గూడ ఉప్పు నీరిచ్చావు. ఇంత

పెద్ద పట్నంలో మీకు మంచినీరు దొరకక పోవడ మేమిటి?" అని ప్రశ్నించాడు. ఆ మాటకు బదులుగా పేదరాశి పెద్దమ్మ "దొరకకేం నాయనా! మా పట్టణమేలే రాజు ధర్మాత్ముడు. మంచినీటి చెరువు—దాని ప్రక్కనే చాకలి చెరువును గూడ త్రవ్వించాడు. వానికి చక్కని మెట్లు నిర్మించాడు. గట్లమీద చెట్లు నాటించాడు. ధర్మ సత్రాలు గూడ గట్టించాడు. ఐనా మాకా మంచినీరు త్రాగే ప్రాప్తం లేదు. అదంతా ఓ పెద్ద కథలే" అన్నది.

"ఆ కథేమిటో నాకు చెప్పు పెద్దమ్మా!" అన్నాడు బాలవర్ధిరాజు.

ఆ చెరువు దగ్గర కెలాగో ఒక పులి చేరింది. అది చాల క్రూరమయింది. ప్రతిదినము దాని నోటి కందెన మేకలను, గొడ్లనే గాకుండా మనుషులను గూడ చంపివేస్తూంది. మామహారాజు గారికి క్రూరమృగమునైనను వారి చేతులతో చంపననే దీక్ష యున్నది. రాజభటు లెవరు దానిని చంపలేక పోయారు. అందుచేత మేమంతా పులికి భయపడి "ఊపిరుంటె ఉప్పునీరయినా త్రాగి బ్రతుక వచ్చులెమ్మని మంచినీటి చెరువు దగ్గరకు పోవడమే మానుకున్నాం.

మా ప్రభువులు ధర్మపాలకు లైనందున ప్రజలను కాపాడాలనుకున్నారు. "ఎవరైనా సరే ఆ పులిని చంపి మానగర ప్రజలకు మేలు చేసినట్లయితే అట్టివానికి నా యేకైక కుమారి సుభద్రాదేవినిచ్చి వివాహం చేయటమే కాకుండా కాశీవిశ్వేశ్వరస్వామి పాదాల సాక్షిగ వానికి నా యీ పులి రాజ్యం గూడ యిచ్చి పట్టాభిషేకం చేస్తా" నని ప్రకటించారు. అప్పటినుండి యిప్పటి వరకు పులిని చంపిన వారులేరు. మాకష్టాలు గట్టెక్క-

నవికా"వని సవిస్తరంగ చెప్పిందా పేదరాశి పెద్దమ్మ. ఆ మాటలు విన్న బాలవర్ధికి నవ్వువచ్చింది. "సరేలే పెద్దమ్మా! నీవు వంటచేయి. నేనింతలో రాజ నగర వీధులు చూచివస్తానంటూ బయలుదేరి పోయి మంచినీటి చెరువును సమీపించాడు.

ముందుకుసాగిన బాలవర్ధి సరాసరి చెఱువు దగ్గరకు పోయి పులికొరకు నాలుగు దిక్కులు కలియ చూచాడు. అడవి చెట్లలో నుండి వస్తూన్న పులి బాలవర్ధిని చూడగానే గాండ్రుమని గర్జించుతూవచ్చి వానిపై కురికింది. బాల వర్ధి తనచేతనున్న పిడిబాకు నతినేర్పుగా దాని గొంతులో గ్రుచ్చాడు. పుల క్రిందపడి గిలగిల తన్నుకుని చనిపోయింది. బాలవర్ధి చనిపోయిన పులిగోళ్ళు తోక కోసుకుని వెనుకకు తిరిగిచూచు నంతలో సమీపించిన రాజభటులు నమస్కారాలు చేసి "రాజకుమారా! నీవు వీరుడవు. ఈ పులిని చంపినవారిని తమసన్నిధికి తీసుకరమ్మని మా రాజావారి యాజ్ఞ. మీకు మేలు జరుగుతుంది. దయచేయండి" అన్నారు.

"నేనీపుడురాను. రేపు మీరాజుగారిని చూడవాస్తా"నంటూ బాలవర్ధిరాజు పేదరాశి పెద్దమ్మ యింటికి పోయాడు. అకట్టివాడే రేపు వారికి కాబోయే ప్రభువు కావున రాజసేవకు లాయన వెంట పూటకూటి యింటికిపోయి "పెద్దమ్మా! మనకింక పులిభయం తీరిపోయింది. మీయింటికి వచ్చిన యీ చిన్నవాడే దానిని చంపేశా"డని చెప్పారు. చెప్పరానంత ఆనందంతో ఉక్కిరి బిక్కిరియైన పెద్దమ్మ "నాతండ్రీ! ఎంతపని చేశావయ్యా!" అంటూ బాలవర్ధికి దిష్టితీసిపోసి స్నానం చేయించి మంచి మంచి కూరలు పిండి వంటలతో భోజనం పెట్టి గౌరవించింది.

# చాకలి తిప్పని సాహసము

నగరంలోని చాకలివాడ కంతకు తిప్పడు పెద్ద. చానాళ్ళనుంతా బట్టలు తికేదా మంచినీటి చెఱువు ప్రక్కనున్న చాకలి చెఱువులోనే. బట్టలుతుక బోయిన చాకలీల నెందరనో పులి పొట్టన బెట్టుకుంది. తిప్పనికా పులిమాట తలచుకుంటేనే పెద్దలు కనపడుతున్నారు. కాపులు కరణాలు విడిచిన బట్టలన్నీ వానింట్లో గుట్టలు పడినై. పులికి భయపడి చెఱువుకు పోయి బట్టలుతకలేక యింట్లోనే మురగ బెట్టుతున్నాడు. గ్రామపెద్దలంతా గుమిగూడి యింటిమీదికి వచ్చి మాగుడ్డలు వుతికితెస్తావాలేదా అని దాడిచేశారు. కొన్ని బట్టలయినా యీనాడుతికి తెచ్చియిస్తానని చెప్పి తప్పించుకున్నాడు తిప్పడు.

చావుగాని బ్రతుకుగాని చాకిరేవుకు పోకతప్పని తిప్పడు, పులి ప్రక్క అడవిలోనికి పోయిన సమయంచూచి కొన్ని బట్టలన్నా పిండుకొనివద్దాం గదా అనేతలంపుతో చెఱువుదాకా పోయాడు. అదురుచు బెదురుతూ అన్నివైపులా చూచాడు. చచ్చిపడిపోయిన పులి వానికంటపడింది. పొదచాటున కనపడకుండ దాగి పులిమీద రాయివేసాడు. అదికదలలేదు. మంచి నిద్రమత్తులో యుండి యుంటుందను కొని మెలమెల్లగా దగ్గరకు పోయిచూచాడు. పులి చచ్చిపోయిందని తెలుసుకున్నాక వానికో దుర్బుద్ధిపుట్టింది. మనరాజుగోరు పులిని సంపినోడికి రాజకుమారి సుబద్రమ్మగారినిచ్చి పెల్లిసేత్తానన్నాడు—యింకా రాజ్యం కూడాయిత్తానన్నాడు. ఇంకేం నాయాలిది సమయం కుదరనే కుదిరింది

నానేపులిని సంపిన దీరుడ్ని అనిసెప్పి రాజుగారల్లుడినై యీరాజ్యానికి రాజునై పోతా"నని పొంగిపోయాడు. తన దగ్గరనున్న మొండికత్తితో మిగిలిన పులికాళ్ళను మొండితోకను కోసుకొని రేపుకు తీసుకోని పోయిన బట్టలనక్కడనే వదిలేసి ధీమాగా యింటికి వచ్చాడు.

చాకలివాడలోని వారంతా "ఏమిటిరా తిప్పా! మాంచి జోరుగావున్నా" వని అడుగుతూంటె, తిప్పడుపైనచూస్తూ "అరవమోకండశ నాయాలలారా! ఇంగమీద మీరునన్ను తిప్పా చిప్పా అన్నారంటె మిమ్మల్ని కాలుసేతులు పట్టుకొని సాకిరేవు బండమీద వుతికిపారేస్తా. సెరువుకాడున్న పులిని చంపేసినా—రేపు పొద్దున రాజుగారి కాడికి పోతుండా. నానింగ రాజుగరమ్మాయిని పెళ్లాడి మీకందరికి రాజును కాబోతుండా. నన్ను మీరంతా "తిప్పయ్య మహారాజా!" అని పిలవండి. అని అంటూంటే వారంతా "వీడికి పట్టిన యీ మదపిచ్చి రేపు రాజురారే వదిలిస్తార్లే" అని అనుకున్నారు.

మరునాడు రాజు సభదీరి కూర్చున్నారు.

తిప్పడు సభలోకి పోయి వాడు యిచ్చిన ఆనవాళ్ళుచూపి "మామయ్య మహారాజా! పులిని నానే సంపినా. ఆనవాళ్ళు కూడ తెచ్చినా. ఇంగ సుబద్రమ్మ గారిని నాకిచ్చి పెళ్లిసేసి నన్ను రాజును సేయి. అన్నాడు. రాజసభలోని మంత్రులా ఆనవాళ్ళు చూచి "ఒరేయ్ తిప్పా! నీవు తెచ్చిన యీపులి కాళ్ళకు గోళ్ళు లేవు. తోకకు కుచ్చులేదు. నీమాట నమ్మిందిగా లేదు. పులిని చంపింది నీవుకాదు. తిక్క తిక్క వేశాలు వేయకుంటా బుద్ధితో తిరిగి పొమ్మన్నారు.

తిప్ప డంతట వారి కెదురు తిరిగి "యాండీ! పులిని నాను సంపక పోతే మీలోసంపిన మొగోడోడుండాడయా, నానేసంపినా నంటె నానే సంపినా రేయి తెలవారుదులూ కోటగోడ గికిగికి దానిగోళ్ళరిగి పోయినై. యాడా తిండి దొరక్క పోయేదలికి నాయాలి పులి దానితోక నదే కొరుక్కొని తింటె యింగ కుచ్చేడుంటాది? ఇద్గో పెద్ద మనుషులు! సుబద్రమ్మ గారికి నన్నిచ్చి పెళ్లిచాయాల్సిందే, తిప్పా అంటె ఒప్పుకోను. తిప్పయ్య మారాజా అనండి. అంతేనని మొండితనంగ మాటాడాడు.

రాజసభలోని వారంతా ఆలోచనలో పడ్డారు.

అంతలో బాలవర్ధిని వెంటబెట్టుకుని సభలోనికి వచ్చిని రాజసేవకులు నమస్కారాలుచేసి "మహారాజా! పులిని చంపిన రాజకుమారుడు" అని పరిచయం చేశారు. మంత్రులా రాజకుమారుడు తెచ్చిన ఆనవాళ్ళను చూచి పులిని చంపిన దీ చిన్నవాడేనని నిశ్చయించారు. రాజుగారంతట సేవకులను రావించి "ముందు మీరీ చాకలి తిప్పను తీసుకొని పోయి తలగొరిగించి సున్నపు బొట్లు పెట్టి పాతచెప్పుల దండ మెడలో వేసి గాడిద మీదెక్కించి నగరం నాలుగు వీధులూ వూరేగింపు చేయించిన తరువాత చీమల మానుకు కట్టివేయండి" అని శాసించాదు. రాజసేవకులు చాకలి తిప్పని తన్నుకుంటూ యీడ్చుకుని పోయారు.

పులిరాజంతట పులిని చంపిన చిన్నవాడు పానుగంటి కార్యవర్ధిరాజు గారి కుమారుడని తెలుసుకుని సంతోషించాడు. రాజమర్యాదలు చేయించాడు. తన ప్రకటన ననుసరించి తన కుమార్తె నిచ్చి వివాహం చేయు ప్రయత్న

మునసుండ బాలవర్ధిరాజు "అయ్యా! నేను నాతల్లి బాలనాగమ్మను పకీరు చెర విడిపించుకొని రాబోతున్నాను. తిరిగి వచ్చేటప్పుడు మీ కుమార్తెను వివాహ మాడుతా" నన్నాడు. అందరకా మాటలు నచ్చినై.

బాలవర్ధి నభినందించిన పులిరాజు మణిహారాలు కనకాంబరాలు బహూక రించాడు. దారి కర్చులకు కావలసినంత ధనం మూట గట్టించి యిచ్చాడు. "రాజకుమారా! నీ ప్రయాణానికొక దారి డొంకలుండవు. ఒంటరివాడవు. ధనం దగ్గరున్నది. పోయేవి క్రొత్తప్రదేశాలు. ఎప్పుడెలాగుంటుందో చెప్పలేం. నీవెంటనొక మిత్రుడుండడు యెందులకైన మంచిది కనుక మా యాస్థాన బ్రాహ్మణ కుమారులలో నాగంబొట్లను వానిని నీవెంట పంపదలం చాను. నీవాతనిని స్నేహితునిగా వెంట బెట్టుకొని క్షేమముగ పోయి లాభము నర"మ్మని దీవించి పంపించాడు.

## నయ వంచకుడు నాగంబొట్లు

క్రొత్త స్నేహితు లిద్దరూ కొంతదూరం ప్రయాణం చేశారు. వారి పుడు చేరిందొక దారిడొంకలు లేని కీకారణ్యం. ప్రొద్దు నడినెత్తి మీది కెక్కింది. ఇద్దరికీ దాహపీడన కలిగింది. ఎక్కడ చూచినా మంచినీరు కన పడలేదు. ఓపిక చేసుకుని ముందు కొందదూరం పోగా వారికో బావి కన పడింది. బావినిండ చెట్లు పెరిగినై. బావిమీద రాతి తాగాణి వేయబడింది.

చుట్టు ప్రక్కల ప్రదేశం జనసంచారం గలదిగానే తోచింది. బాటసారుల చేతులలో చెంబులేదు—చేదాలేదు. బావిలోని నీరు బయటకు వచ్చేదెలాగా! వారి దాహం తీరే దెలాగా?

రాజకుమారు డుపాయం చేసి తలపాక విప్పి ఒక చెంగు బావిమీది తాగాణికి బిగించి కట్టి రెండవచివర బావిలోనికి వదిలాడు. నాగంబొట్లూ నీవు బ్రాహ్మణుండవు. ఆకలి దప్పికల కోర్వలేవు. ముందు నీవీ నాతలపాకి సాయంతో బావిలోనికి దిగి నీరుద్రావి బయటకురా. తరువాత నేనుగూడ నీలాగే దప్పి తీర్చుకుంటా" నన్నాడు.

సరేనని ముందుగ బావిలోనికి దిగి కడుపునిండ మంచినీరు త్రాగి వెలుపలకువచ్చిన నాగంబొట్లు "రాజకుమారా! లోపల మంచినీరైతే టెంకాయ పాలుకన్న మధురంగ వున్నాయి కాని గచ్చపొదలు నిండియున్నవి. పొర పాటున నీయాభరణాలందులో పడిపోతే దొరకవు కనుప నీవు నీరాజముస్తులు, మణిహారాలు, కరవాలం వెలుపలనే యుంచి బావిలోనికి దిగడం మంచి" దన్నాడు. బాలవర్ధి తన విలువైన సువర్ణాభరణాలను, కరవాలమును తీసి నాగంబొట్లు చేతికిచ్చి మంచినీరు త్రాగుటకా బావిలోనికి దిగాడు. అదేతగిన యదననుకొనిన బ్రాహ్మణ చిన్నవాడు కరవాలంతో తాగాణికి గట్టిన తల పాక కోసి వేసి బాలవర్ధిరాజిచ్చిన బంగారాన్ని ధనాన్ని చేతపుచ్చుకుని వెళ్ళి పోయాడు.

బాలవర్ధి యిపుడా బావిలో నుండి వెలుపలకు వచ్చే యుపాయం లేక పోయింది. నమ్మించి నాగంబొట్లు చేసిన పని కెంతగానో బాధపడుతూ బావి

లోనే వుండిపోయాడు. ఏ మహానుభావుడో వచ్చి వెలుపలకు తీస్తేనే బాలవర్ధి బ్రతికున్నట్లుగ పరిణమించింది.

గంగపట్నం మేలు రాజకుమారుల కది నివాస స్థానం. వారు వేటాడ వచ్చినపుడెల్లయు యీ బావి దగ్గర గుడారాలు వేసుకొనడం సాంప్రదాయం. ఎప్పటి మాదిరిగనే వచ్చిన గంగపట్నం రాకుమారు లక్కడ విడిదిచేయ దలంచారు. రాజసేవకులు నీటికై బావిలో చేదలు వేశారు. కడవలు తగిలిన రాజకుమారుడు "అమ్మా!" అని కేకబెట్టి నందున వారు బావిలో నెవరో వున్నారని గ్రహించి తగిన సాధనోపాయంతో బాలవర్ధిని వెలుపలకు తీశారు.

ఆయన శరీరమంతటా గచ్చపొదలు గీచిన నెత్తురు చారలున్నవి.

మనిషి చాల నీరిసించి వున్నాడు.

అదిచూచిన గంగపట్నం రాకుమారు లాయన కుపచారాలు చేయించారు. కాస్త పుంజుకున్న బాలవర్ధి వారికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. రాకుమారులు "బాబూ! నీవు పూర్తిగ సొక్కియున్నావు. నీయూరు పేరుల వివరాలడిగి నిన్నింకా శ్రమపెట్టడం మా యభిమతం కాదు. నిన్నిలా నట్టడవిలో విడిచి పోవడానికి మా మనసు లంగీకరించడం లేదు. మావెంట మానగరం పోదాంరా. నీకారోగ్యలభించినాక నీ మంచి చెడ్డలడిగి తెలుసుకుంటాం" అని వారి వెంట బాలవర్ధిని తమ నగరానికి తీసుకొని పోయి రాజనగరంలో రాజ మర్యాదలు చేయించారు.

వారం రోజులు గడిచినై.

బాలవర్ధిరాజు తిరిగి ఆరోగ్యవంతుడయ్యాడు.

అతను పానుగంటి పురమేలు వర్ధిరాజుల కుమారుడని విని గంగపట్నం రాజు లానందించారు. అతిథి మర్యాదలు చేశారు. ఆలాజాలంగా అంతా కలిసి తిరిగారు. ఒకరి మీదొకరికి విడరాని అభిమాన మమకారాలు కలిగిన్నై.

# నాగంబొట్లు పడిన నరక యాతనలు

నమ్మక ద్రోహం చేసి బాలవర్ధిని బావిలో పడవైచి రాజాభరణాల నెత్తుకుని పోయిన నాగంబొట్లు సరాసరి గంగపట్నం చేరి బంధువుల యింటికి పోయాడు. నాగంబొట్లు పులిరాజ్యంలో రాజాస్థాన బ్రాహ్మణ కుటుంబానికి చెందిన వాడైనందునను. యిపుడు బొలెడంత ధనం పుచ్చుకుని వచ్చినందునను బంధువు లాతనిని సగౌరవంగ చూచి మర్యాదలు చేశారు. ఆ రాత్రికి నాగంబొట్లు భోగం రంగసాని యింటికి పోయి శయనించాడు. రంగసాని నాగంబోట్లు వాలకం గమనించింది. అతని దగ్గర సొమ్మున్నట్లు గ్రహించింది. అతనిని యింక కొంచెం మైకంలో చేర్చి వానిదగ్గరున్న ద్రవ్యాన్నంతా గుంజుకుంది. దీనినిలా విడిచిపెట్టరా దనుకొనిన రంగసాని నాగంబోట్లు మీద నేరాలు కల్పించి రాజభటుల కొప్పగించింది.

రాజభటులాతనిని నేరవిచారణకు రాజసభలో నిలబెట్టారు. నాగబోట్లుకు తగిన సాక్ష్యం లేకపోయింది. విచారణలో ఆయన నేరస్థుడయ్యాడు. న్యాయ

స్థానం వానికి నూరు కొరడాదెబ్బల శిక్ష విధించింది. ఆనూరు దెబ్బలతో బ్రాహ్మణ కుమారుని రానీయక వేడలగొట్టారు. ఇంద్రభోగాలనుభవించాలను కున్న నాగంబొట్లు కుక్కపాట్లు పడవలసి వచ్చింది. ఎంతచెడినా బాపన ముండా కొడుకు గదా అని యెవరో పెట్టిన అన్నంతిని రాజుగారి రథశాల ప్రక్క కూలబడ్డాడు.

అదే సమయంలో రాజకుమారులు బాలవర్ధిని వెంటబెట్టుకుని వారు నూతనంగ నిర్మించిన దేవాలయం చూపడానికి వస్తున్నారు. రథశాలప్రక్కగ యీగలు దోలుకుంటుకూర్చున్న నాగంబొట్లును చూచి బాలవర్ధిరాజు "ఏం? మిత్రమా! ఇక్కడున్నావేం! బాగున్నావా!" అన్నాడు. బాలవర్ధిని చూడడం తోనే నాగం బొట్లుకు ప్రాణా లెగిరి పోయినై. గుండెదడ పుట్టు కొచ్చింది. నోటి మాటరాక దిష్టిబొమ్మలా కూర్చుండి పోయాడు. రాజకుమారులు వింత పడి "ఏమిటి? ఈ పరమ దుర్మార్గుడు మీ చెలికాడా" అని బాలవర్ధి నడిగారు. బాలవర్ధి చిరునవ్వు నవ్వుతూ "ఈయన పుణ్యాననే నేనా బావిలో పడి పోయాను. నేను బావిలో యుండుటచేతనే మీరు నన్ను కాపాడారు. మీరు కాపాడినందుననే మన కింత బాంధవ్య మేర్పడింది" అన్నాడు.

రాజకుమారులు వెంటనే సేవకులను నియమించి "మీరీ మిత్రద్రోహిని తిరిగి రాజసభకు తీసుకరండి" "అని యాజ్ఞాపించి వెళ్ళిపోయారు." బాల వర్ధిని బావిలో పడవేసిన ద్రోహి యితనే" నని నాగంబొట్లు మీద నేరం రుజువయింది. రాకుమారు లాతనిని అక్కడ కక్కడనే "నరికివేస్తా" మని కత్తులు దూశారు. కాని బాలవర్ధి వారిని వారించి "అయ్యలారా! మీరిం

తకు ముందు విధించిన నూరు దెబ్బలతో వీని శరీరం గాయాలు పడింది. గాయాల నుండి నెత్తురు వచ్చింది. అదిప్పుడు చీముగ మారింది. దానిమీద యీగలు ముసురుతున్నాయి. వీనికితోడీతనికి తినతిండిలేదు–కట్టబట్టలేదు. నిలువ నీడలేదు. ఇంతకన్న ప్రత్యక్ష యమలోక మింకెక్కడుంది? ఇత నింకా యీనరకబాధ లనుభవింప కుండనే మీరొకే సారి వీనిని చంపివేయ డం మంచిదని నాకు తోచడం లే" దన్నాడు.

ఆ మాటల నేర్పుతనాని కందరూ మెచ్చుకున్నారు.

నాగంబొట్లును బయటకు వెళ్ళగొట్టారు.

బాలవర్ధిని చూచి గంగపట్నం రాజు కుమార్తె ప్రేమించింది. రాజు గారు బాలవర్ధికి తన కుమార్తె నిచ్చి వివాహం చేయ నిశ్చయించుకున్నాడు. బాలవర్ధిరా జంటట "అయ్యా! నేను నాతల్లి బాలనాగమ్మను పకీరు చెంత విడి పించుకొనిరా బోతున్నాను. తిరిగి వచ్చేటప్పుడు మీ కుమార్తెను వివాహ మాడతా" నని చెప్పి వారి మన్ననల పొంది ప్రయాణం సాగించి సాయం త్రానికో యడవికి చేరాడు. చీకటి పడింది. నల్లమబ్బులు క్రమ్మినై. దగ్గ రలో పాడుబడిన దేవాలయ మున్నది. రాకుమారుడు లోపలకు పోయి చూచాడు. గుడిలో చిన్నదీపం మిణుకు మిణుకు లాడుతుంది. అమ్మవారి బొమ్మ వెనుక పండుకునే వనరున్నది. ప్రయాణపు బడలిక గొన్న బాల వర్ధి గుడి తలుపులు బిగించి విగ్రహం చాటున పండుకుని నిద్రపోయాడు.

# నక్క చెప్పిన చక్కని వైద్యము

నదిరేయి దాటింది. బాలవర్ధికి మెలుకువ వచ్చింది. గుడిముందున్న మండపంలోనుండి మాటలు వినబడుతున్నయ్. రాజకుమారుడాలకిస్తూ పడుకున్నాడు.

ప్రతిరోజు నిశీధకాశాన అక్కడికి పులి ఎలుగు నక్క పాము నలువురుచేరి, మండపంలో సమావేశం కావడం ఊళ్లో వార్తలు చెప్పకొనడం నాల్గవజాము కాగానే యెవరిపనుల మీద వారుపోవడం పరిపాటిగ జరుగుతూంది. ఆనాడుకూడ మామూలు తప్పకుండ నలువురు మిత్రులక్కడ కలుసుకున్నారు. అందరిలో పెద్దగావుంటూన్న పులితక్కిన వారినిచూచి "నగరంలో సంగతులేమిటి!" అని ప్రశ్నించింది. ఎలుగుబంటు నాకేమీ తెలియదన్నది. పాము మన నక్కబావ కేమైన వార్తలందియుండవచ్చునన్నది. నక్క గొంతు సవరించుకుని "మన చిలుకవాది పట్టణమేలు సూర్యచంద్రరాజు కుమార్తెకు రాచకురుపు లేచింది. ఆరు నెలలనుండి మానలేదు. రేపో యెల్లుండో ఆమె చనిపోయే స్థితిలో వున్న"దని చెప్పింది.

పులిరాజంతట "ఆ కురుపు మానే వైద్యం లేదా!" అని అడిగింది.

లేక పోవడమేమిటి? ఉన్నది. మన మిప్పుడున్న యీ గుడిమీదనే తెల్లాకులు నల్ల పూల చెట్టుంది. రాజకురుపు మీద అది సంజీవిలాగ పనిచేయగల సిద్ధి మూలిక. దాని పూవులేడు ఆకులేడు కోసికొని పోయి కురుపు మీద

యేడు పూవుల రసం పిండి యేడాకులు వేసి కట్టుకట్టి మూడవనాడు కట్టు విప్పిచూస్తే కురుపానవాలు లేకుండా మాయమైపోతుం"దని చెప్పింది. అంతలో తెలవార వచ్చినందుననని లేచి వానివాని పనులమీద అడవిలోనికి పోయినై.

సూర్యోదయమయింది. కాలకృత్యాలు తీర్చుకున్న రాకుమారుడు గుడిమీదకెక్కి నక్క చెప్పిన గుర్తులుగల చెట్టునుచూచి కావలసిన పూలాకులు కోసుకుని సమీపము నందున్న చిలుకవాది పట్నంచేరి రాజభవన ద్వారపాలకునితో "అయ్యా! నేను రాకుమారి రాచకురుపు నయంచేయడానికి వచ్చాను. నీవునాకు మీరాజదర్శనం చేయించితేచాలు. రాజుగారు నాకిచ్చే బహుమతిలో నీకు సగమిస్తా"నంటూ పదివరహాలు చేతికందిచాడు. కోటద్వార పాలకుడు సొమ్ముకాసించి యింకొక సేవకుని నియమించి విదేశీయ వైద్యునికి రాజదర్శనం చేయించాడు.

అప్పటికే రాజకుమారి పరిస్థితి విషమించి పోయింది. "ఆమెను బ్రతికించడం మాచేతగా" దని రాజవైద్యులు, రణవైద్యులంతా యిండ్లదారి పట్టారు. మహారాణి మొదలైన వారంతా కుమార్తె మీది బెంగతో మంచం పట్టారు. రాజుగారి రెండు కన్నులు నీటికుండ లయ్యాయి. రాచకురుపు మాన్పుతానని వచ్చిన రాకుమారు డెవరి కంటికీ ఆగలేదు. ఐనా కన్నకడుపు కనుక చిలుకవాది పట్నపు రాజు "ఏపుట్టలో యేపామున్నదో యెవరు చూచారు? చివరిసారి యీవైద్యం గూడ చేయించి చూద్దా" మన్నాడు. అంతఃపురం లోనికి పోయిన రాకుమారుడు రాకుమారి రాచకురుపు మీద యేడు

పూవుల రసం పిండి యేడాకులు వేసి కట్టుకట్టి యెల్లుండి యీకట్టు విప్పుతా" నన్నాడు.

ఆ రాత్రికి రాకుమారి హాయిగా నిద్రపోయి లేచింది.

బాలవర్ధి మూడవనాడు కట్టువిప్పిచూడగా రాచకురుపానవాలయినా లేకపోయింది. వారంతా క్రొత్తవైద్యుని కొనియాడారు. రాజసన్మానాలు బాలవర్ధికి లభించినై. చిలుకవాది పట్టణంలోని ప్రజల కపుడా బాలవర్ధిప్రత్యక్ష భగవంతుడయ్యాడు. నగరాధీశ్వరుడు స్వయంగా కానుకలిచ్చి "రాకుమారా బ్రతకదని నిరాశ చెందిన నాబిడ్డను బ్రతికించిన నీకునేనేమిచ్చిన నీఋణం తీరేదికాదు కనుక ఆమెనే నీకీయ దలచాను. నాకు పుత్రసంతానంకూడలేదు. నాకిపుడు కొడుకువైన అల్లుడవైన నీవె" నన్నాడు. బాలవర్ధి చిలుకవాది పట్ట ణపురాజుతో "అయ్యా! నేను నాతల్లి బాలనాగమ్మను పకీరు చెరవిడిపించు కుని రాబోతున్నాను. తరిగివచ్చేటప్పుడు మీకుమార్తెను వివాహమాడతా" నని చెప్పి అక్కడనుండి బయలుదేరి నాగళ్ళపూడిగట్టు చేరుకున్నాడు.

## రాకాసి మెప్పులొందిన రాకుమారుడు

నాగళ్ళపూడిగట్టు మఱ్ఱిచెట్టుమీద కాపుర ముంటుంది బ్రహ్మరాక్షసి. అదిగూడ పకీరు పరివారంలోనిదే. అక్కడ కెవరైనా శత్రువులు వచ్చినట్ట

యితే అమాంతంగా చంపుకుని తినివేయమని పకీరు తనకిచ్చిన సర్వాధికారం బాలవర్ధిని చూడడంతోనే భయంకర వికృతాకారంతో వచ్చి రెండు చేతులతో పట్టి కబళింప బోయింది. దానిరూపం చూచిన బాలవర్ధికి గుండె గుభీలుమంది ధైర్యంచేసి మనసులో "దేవా! నాగేంద్రస్వామీ! నేను నీ వరపుత్రిక బాల నాగమ్మ కుమారుడను. నన్నీ యాదపనుండి కాపాడి సాయం చేయరావా!" అని ప్రార్థించాడు.

నాగేంద్రస్వామి మహిమ వలన బ్రహ్మరాక్షసి యెత్తిన చేతులు యెత్తినట్లే నిలిచిపోయినై. ఇక తానెంతా పెనుగులాడిన కొయ్యబారిపోయిన కాలుసేతులు స్వాధీనానికి రాలేదు. గిజగిజ తన్నుకుంది. పెడబొబ్బలు పెట్టింది. ప్రయోజనం లేదని తెలుసుకొనిన బ్రహ్మరాక్షసి "అయ్యా! నీవు మహామహిమ కలవాడవు. మహిమాయావియైన మాయలపకీరు నన్నిక్కడ యంత్రబద్ధంచేసి పొలిమేరశక్తినిగా నియమించాడు. వాని యానతి ప్రకారం యిక్కడకు వచ్చిన వారిని చంపితినడం నాపని. నేనింక యీ యుద్యోగం చేయను. నాకాలుసేతులు నాస్వాధీన మయ్యేలాగాచేస్తే నీకు నేనుపకారం చేస్తా"నని రాజీ పడింది.

నేను పానుగంటిపురానికి చెందిన బాలనాగమ్మ కుమారుడను. మా యమ్మ చెరవిడిపించుకొని పోవచ్చును. నిజంగ నీవు నాకు మేలుచేయ దలచు కుంటె నాగేంద్రస్వామి దయవలన నీకాళ్ళచేతులు నీకు స్వాధీనం కాగల" వన్నాడు రాజకుమారుడు. ఆమె ముమ్మారు నాగేంద్రస్వామి నామస్మరణం చేసింది. బ్రహ్మరాక్షసి వెంటనే బ్రాహ్మణస్త్రీగా మారిపోయింది. ఆమెకు పూర్వజన్మజ్ఞానం కూడకలిగింది.

బాలవర్ధి! నేనిపుడు బ్రాహ్మణస్త్రీనిగా నిన్ను దీవించుచున్నాను. నాగేంద్రస్వామి నిన్ను కాపాడగలడు. నీకు జయం కలుగుతుంది. పకీరు పరమ దుర్మార్గుడు. వాడిపాపం పండింది. నీవా పకీరు కోటలోనికి పోయే యుపాయం చెప్పుతున్నాను. అని మూలమైన విషయంచెప్పి దీవించింది.

బాలవర్ధిరాజు సరాసరి తంబళ్ళపెద్ది యింటికిపోయి "అవ్వా! గొంతు కెండిపోతూంది. కాసిని దాహమిస్తావా!" అన్నాడు. తంబళ్ళపెద్ది బాగా వయసుడిగిపోయిన ముసలమ్మ. గబగబా మంచినీరు తెచ్చియిచ్చి "ఎవ్వారు నాయనా! ఎందాక ప్రయాణ"మని అడిగింది.

బ్రహ్మణస్త్రీ చెప్పిన మాటలు మనసు నందుంచుకున్న బాలవర్ధి "అదంతా ఒక కదుందిలే అవ్వా! మాది పడమర రాజ్యం. మాయమ్మ తంబళ్ళనాగమ్మ, మానాన్న శరభయ్య. మాఅవ్వపేరు పెద్ది ఆమె యీ నాగళ్ళపూడి గట్టుమీద యుంటుందని మామ్మానాన్నచెప్పితే ఆమెను చూడాలని వెదుకుకుంటూ వచ్చాను. అవ్వా! అవ్వా! నువ్వు పెద్దదానవు. మా యవ్వ తంబళ్ళపెద్ది యుండేదెక్కడనో తెలిస్తె నాకు చెప్పవూ!" అన్నాడు. ఆమాటలు వినడంతోనే పెద్దికి పోయినప్రాణం లేచివచ్చింది. అమాంతంగా కావిలించుకుని "నీవువీరయ్య వటరా నాయనా! నేనేరా మీయవ్వనం"టూ చుట్టరికం కలిపింది. తనయెత్తు పారిందనుకొన్న బాలవర్ధి లోలోన సంతోషించి నేనే నీమనుమడు వీరయ్య నవ్వా! అని యేడ్చినట్లుగా నటించాడు.

తంబళ్ళపెద్ది చకచకా బాలవర్ధిని స్నానం చేయించి భోజనం పెట్టింది. మనుమని చూచుకున్న సంబరంలో పెద్దిపూలమాల కట్టడం మరచి

పోయింది. వేళమించితే పకీరు కోపబడతాడని తహతహలాడడం మనిపించిన బాలవర్ధి "నేను కట్టియిస్తానిటుతేలవ్వా!" అంటూపూలందుకుని అప్పటికప్పుడే మాలకట్టియిచ్చాడు. ఆలస్య మవుతుందనే భయంతోదడదడ లాడుతూ కోటకు పోయిన పెద్ది పూలమాలనా పకీరు చేతి కందించి నిలబడింది హడలిపోతూ,

పకీరా మాలను చూచి మురిసిపోయాడు. "పెద్దీ! ఈదండ నీవు కట్టింది కాదే. ఈరోజు మాల చాల సొంకంగా బింకంగా వున్నది. ఎవరు కట్టారో నిజం చెప్పు" అన్నాడు. భయపడుతూన్న పెద్దికి ధైర్యం వచ్చింది. "మావాడే దొరా! నా మనుమడు వీరయ్య కట్టాడు. బాగున్నదా!" అన్నది అమాయకంగ. పకీరు సగర్వంగ "బాగంటె బాగా —చాల బాగున్నది. రేపు వాడిని మామహలుకు తీసుకొనిరా! మంచి బహుమతి యిస్తాం"అన్నాడు. బాల వర్ధికి కావలసిందదే. మరునాడు పెద్దివెంట పకీరు కోటకు వెళ్ళాడు.

# అపాయము లేని ఉపాయము

బాలవర్ధిని చూచిన పకీరు "ఏమోయ్! వీరయ్యా! పూలమాల ఛాల బాగా కట్టావోయ్! ఎక్కడ నేర్చావీ విద్య?" అన్నాడు హుక్కా పీలుస్తూ. ాలవర్ధికి మంచి సమయం కుదిరింది. యుక్తిగా "నాపనితనం మీరిపుడేం ాచారు మహారాజా! పకీరు సాయిబుల వారు పరీక్షింనా లనుకుంటె పనితనం చూపిస్తాను—పారితోషిక మందుకుంటాను. చూపులకు సొగసు తనమే కాదు.

వలచిన ప్రియురాలు వశపడి పోతుంది. ఏమగాడైనా నేను కట్టిన దండ చేత పుచ్చుకుని తన్నంతకు ముందు తిరస్కరించిన యాడదాని దగ్గరకు పోయి నాచేతిలోని మాల చూస్తునే చిత్తయి పోయి స్వాగతం చెప్పి స్వాధీనం కావాలి. నామాట నమ్మిన వారిది సొమ్ము—నమ్మకపోయిన వారిది దు" మ్మన్నాడు.

పకీరు పరమానంద భరితు డయ్యాడు. "అలాగటరా! వీరయ్యా! అయితే నీవిలాగరా! మా బందీలో మాట వినని మకురుబోతు మగువ యొక తున్నది. దానిని మావశం చేయగలవా! చెప్పినమాట చెల్లించక పోతే చిత్ర హింసల పాలవుతావు. గట్టి నమ్మకముంటేనే కార్యరంగంలోనికి దిగు. ఏమంటావ్?" అన్నాడు.

వెంటనేచిటిక వేసిన బాలవర్ధి "అది నాకెంత పని మహారాజా! ఐతే ఒక నియమం. ఆడవారిలో కొన్ని జాతులున్నాయ్. వానిని నేను కంటితో చూచి పలుకరించి మాటాడి ఏ జాతికి చెందినదో గమనించాలి. జాతికి తగిన పూలతో చెండు గట్టి యిస్తే—అది మీరు పట్టుకొని, అనుకున్న ఆడదాని కంట బడితే—ఆ తరువాత వీరయ్య ప్రతాప మర్ధమవుతుంది. ఈరోజే మీరు నాకామెను చూపి మాటాడించండి. రేపు మాల కట్టి మీకందిస్తాను. మీరా మాలను చేత పట్టుకుని వెళ్ళండి. ఆమె మీకు స్వాగతం పలుకక పోతే నాపీక తీయించండి. మీకు నిదర్శనం కనపడిందాకా నేను మీకోటలోనే వుంటాను. పకీర్ సాబ్! నేనామెను కంటితో చూచి కంఠస్వరం వినుటప్పుడు మూడవ మనిషా

పరిసరాలలో తిరుగకూడదు. మీరక్కడ నన్ను మోసగించితే నా యంత్రం పారదు. మీకీ జన్మలో కోరిక నెరవేర" దని మంచి యిరకాటంలో పెట్టాడు.

పకీరు కా మాటలమీద నమ్మకం కలిగింది. "సరె! ఇవిగో యీతాళం చెవులు తీసికొని పోయి బందిఖానాలో నున్న బాలనాగమ్మను చూడు. నీవెంట నెవరూ రాకుండ చేస్తాను. రేపు నాకు నిదర్శన మియ్యాలిసుమా!" అంటూ బీగము లిచ్చాడు. బాలవర్ధిరాజు సరాసరి బాలనాగమ్మ చెరశాలకు పోయి తలుపులు తెరచి "అమ్మా!" అని నమస్కారం చేసి సమీపింప బోయాడు. కాని బాలనాగమ్మ నమ్మలేక పోయింది. పకీరే యీ నాటక మాడుతున్నా డనుకుని యిదిలించి పారేసింది.

బాలవర్ధి తానెటువంటి మోసగాడనూకానన్ని—నిజంగ నీకుమారుడు బాలవర్ధి రాజునే నని యెన్నో గుర్తులు చెప్పాడు. ఆమె నమ్మలేక పోయింది. అమ్మను నమ్మించలేక పోయి నందున బాలవర్ధి బాధపడ్డాడు. అదంతా నాటకమే ననుకుంటుంది బాలనాగమ్మ. చివర కాతడు చిన్ననాడు తనచేతి కిచ్చిన యుంగర మానవాలు చూపాడు. అప్పటికి నిజం తెలుసుకునిన బాలనాగమ్మ కొడుకు నాలింగనం చేసుకుని యేడ్చింది. అక్కలు మొదలైన వారందరి క్షేమ సమాచారాల నడిగింది. "నాకోసమని నీవింత దూర మెందుకు వచ్చావు నాయనా! నిన్నీ దుర్మార్గుడు చంపకుంటాడా! నాకింక బ్రతుకు మీదాశలేదు. మొదటలో గత్యంతరం లేక నాకు పదునాలుగేండ్లు వ్రతమున్నదని బొంకి యిప్పటిదాకా బ్రతికి వున్నాను. ఆ గడువు యింకొక వారం రోజుల్లో తీరి పోతుంది. నేనూపిరితో నుండగానే నీవిన్నాళ్ళకు నాకంటపడ్డావు. ఈజన్మ

కింతకంటె కోరదగిన దికలేదు. నీవింటికి పోయి నూరేండ్ల పాటు బ్రతికి బాగుండు బాబూ." అంటూ కన్నీరు నింపుకుంది.

"మరేమీ భయపడకమ్మా! నేనన్ని యేర్పాట్లు చేసే వచ్చాను. మోస గానిని మోసంతోనే జయించాలి. నేనిపుడు తంబళ్ళపెద్ది యింటి దగ్గర నుండి పూలమాల గట్టి పంపుతాను. ఆ దండ చేతపుచ్చుకుని పకీరు నీదగ్గరకు వస్తాడు. నీవపుడాతనిమీద మమకారం కలిగినట్లు నటించి పకీరు ప్రాణరహస్యం చెప్పించుకో. అదొక మొగలిరేకుమీద వ్రాసి నాకు పంపించు. నేనీ పకీరు ప్రాణాలు పట్టుకొచ్చి నిన్ను నాన్నను పెదనాన్నలను విడిపించుకొని పోతా" నని చెప్పాడు బాలవర్ధిరాజు.

# ప్రాణరహస్యము చెప్పిన పకీరు

మరునాడు బాలవర్ధిరాజు పూలమాల గట్టి పెద్దిచేత పంపించాడు. పకీరా మాలను చేత పట్టుకొని చెఱశాలకు పోయాడు. అది చూచిన బాలనాగమ్మకు కొడుకు చెప్పిన మాటలు గుర్తుకొచ్చినై. నిజానికి నాగమ్మ పకీరు మొఖం చూచి మాటాడడమంటె యెంత మాత్రమూ యిష్టం లేదు. అతని కిరాతక చర్య కామె బలియై పోయినా విచారం లేదు. కాని, తన్ను నమ్ముకుని—యిన్ని గండాలు గడచి—యింత దూరం వచ్చి—యింకెంత సాహసమో చేయాలనుకున్న కున్న తన కుమారుని గురించి యోచించింది. చివాలున లేచి

యెదురు నడుస్తూ చిరునవ్వు నటించి "పకీరు సార్వభౌములకు స్వాగతం. సుస్వాగతం" అన్నది.

ఆమాటలు వింటూనే పకీరు పరవశమై పోయాడు. అసలు మర్మమంతు పట్ట నందున యిదంతా వీరయ్య కట్టి పంపిన పూలమాల ప్రభావమే ననుకున్నాడు. "నాకాహ్వానమిస్తున్నది నా బాలనాగమ్మేనా!" అన్నాడు నవ్వుతూ. ఆమాట నందుకొనిన బాలనాగమ్మ "నావ్రతమింక యేడురోజులే నున్న" దన్నది. పకీరా నందంతో పొంగి పోయి "నీవూ నాలాగ రోజులు లెక్క బెట్టుతున్నావన్నమాట!" అన్నాడు. నాగమ్మ తిరిగి "నేను మాత్రం ఎన్నాళ్ళు బందీలో నుండగలను? కాని పకీరు! నీవింత బలవంతుడివి గదా! నీకీ దేశ మంతటా శత్రువులే కద! ఒకనాడున్నట్టు వింకొక నాడుండదు గద! పగవారంతా పట్టుబట్టి నిన్ను చంపివేస్తే నాగతేమి కావా" లని నావిచార మన్నది.

పకపకా నవ్వాడు పకీరు. పిచ్చిదానా! నాప్రాణా లంత తేలికగ పోయేవి కావు. దానికి చాల బందోబస్తుంది. చెప్తాను విను. ఏడు సముద్రాలు దాటాలి—ఏడు సముద్రాల కావల కీకారణ్యం. అరణ్యంలో పన్నెండామడల మఱ్ఱి చెట్టు. మర్రిచెట్టు తొఱ్ఱలో నుండి పాతాళలోకానికి దారి. పాతాళలోకంలో కొండగుహ. గుహలో నాగుమల్లి పొద. పొదలో పంజరం—పంజరంలో పంచవన్నెల రామచిలుక. ఆ చిలుకలో నాప్రాణం భద్రపరచ బడియుంది. ఈరహస్య మెవరికీ తెలియదు. తెలిసినా పోలేరు— పోతే తిరిగి రాలేరు. జాలా! పకీరుకు చావులేదే" అన్నాడు.

పకీరు ప్రాణరహస్యం దొరకనందుకు బాలనాగమ్మ ముఖం కళకళ లాడింది. అది చూచిన పకీరు నిజంగ నాగమ్మకు తనమీద మమకారం పుట్టు కొచ్చిం" దనుకున్నాడు. సరె యీ వారం రోజులయ్యాక మనం మళ్ళీ కలుసుకుందాం. వస్తా" నంటూ తిరిగి పోయాడు. విన్నది విన్నట్టుగ మొగలి రేకు మీద వ్రాసి తంబళ్ళపెద్ది చేతికిచ్చి కుమారుని కంద చేసింది బాల నాగమ్మ.

మాయల పకీరు ప్రాణ మర్మం తెలుసుకున్న బాలవర్ధిరాజు "అవ్వా! అవ్వా! ఒకచోట బోలెడంత డబ్బుంది తీసుక వస్తాను. నీవిక్కడనే యుం టావా!" అన్నాడు. ముసలిదానికి డబ్బంటె మితిమించిన ఆశ. "తప్పకుండ తీసుకరా నాయనా! నిన్నొక యింటివానిని చేస్తాను. మంచి మేడ కొంటాను. పట్టెమంచం కొంటాను. పాలు పాయసాలు వండిపెడతా" నని చెబుతూ చద్ద న్నం మూట గట్టి యిచ్చింది. ప్రయాణమైన బాలవర్ధిరాజు పోయి పోయి సముద్రతీరం చేరుకున్నాడు. సముద్ర మంతులేనంత దూర మున్నది. ఎంత సేపు చూచినా అవతల దరి కనపడడం లేదు. అంత గొప్ప సముద్రాన్ని దాటేదెలాగా" నని ఆలోచనలో పడ్డాడు. ప్రక్కనున్న చెట్టుక్రింద పవళిం చాడు.

బాలవర్ధి కెదురుగ యింకొక చెట్టుంది. ఆచెట్టుమీద పిట్టల గూడుంది. గూటిలో పిల్లలు చేసిన కిలాకిలా రావంతో వాని చూపటు మళ్ళింది. పెనుబా మొకటి చెట్టునెక్కడం వాని కంట బడింది. సంఘటన నంతా అర్థం చేసు కున్నాడు. గూటిలోని పక్షిసంతానాన్ని చంపి తినటాని కా పాము చెట్టెగ

బ్రాకు తూంది. పామును చూచి భయపడిన పిల్లలు వచ్చీరాని భాషతో నాక్రం దింప సాగినై. దిక్కులేక ప్రమాదంలో నున్న పక్షి సంతానాన్ని రక్షించా లనుకున్నాడు బాలవర్ధిరాజు. చివాలున లేచి యొరనున్న కరవాలం విదిలించి పామును ముక్కలు ముక్కలుగ నరికి పారేసినాక తిరిగి వచ్చి పండు కున్నాడు.

## పక్షు:బడిన పక్షిరు ప్రాణముఃలు

మేతలకై పోయిన గండభేరుండ పక్షులు తిరిగి గూటికి వచ్చి చేరు కున్నవి. చచ్చి ముక్కలై పడియున్న పామును చూచి హడలి పోయినై. తొందర తొందరగా గూటిలోనికి పోయి పిల్లలను చూచుకున్నవి. వాని సంతానమంతా సలక్షణంగా వున్నందున సంతోషించినై. "ఏం జరిగిం దమ్మా!" అని బిడ్డల నడిగినై. పక్షి సంతానం తల్లి దండ్రులతో మమ్మల్ని చంపి తినడానికి పాము రావడం చూచి మేమాక్రందనలు చేశాం. ఆ చెట్టు క్రింద పవళించియున్న రాకుమారుడు మామొరాలకించి పామును చంపి మా ప్రాణాలను కాపాడాడు. ఆయన లేకపోతే మనకీపాటికి రుణం తీరిపోయే" దని చెప్పినై.

గండభేరుండ పక్షులికి రాజకుమారుని మీద సానుభూతి కలిగింది. తెచ్చిన ఆహారం పిల్లలకింత తినపెట్టి అవి యింత తిని నేరుగ రాజకుమారుని

చెంతకు వచ్చి వాలినై. "అయ్యా! మీరు పుణ్యాత్ములు. మేమింట లేని వేళ మా బిడ్డలను కాపాడి మాకు గర్భశోకం రాకుండ చేశారు. ఏవూరు వాడవో! ఏయమ్మ కన్నబిడ్డవో? నీతల్లికడుపు చల్లగ వెయ్యేండ్లు వర్థిల్లు నాయనా! ఇంతకూ నీ పేరేమిటి? నీ యూరేమిటి? నీవిక్కడకు వచ్చిన పనేమిటో చెప్పు. మాకు చేత నైన దంటూ యుంటే తప్పకుండా చేసి నీ రుణం తీర్చుకుంటాం" అని అడిగినై. బాలవర్ధి చెప్పిందంతా వినినై. అందులో మగపక్షి "ఓ! ఇదేనా! రేపు ప్రొద్దుననే నేను నారెక్కలమీద నెక్కించుకుని పోయి సప్తసముద్రాలు దాటిస్తా" నని చెపుతూండగనే ఆడపక్షి ఎగిరిపోయి తియ్య తియ్యని పండ్లు తెచ్చి యిచ్చింది. బాలవర్ధికి ధైర్యం వచ్చింది. గండభేరుండ పక్షి తెచ్చి యిచ్చిన పండ్లు తిని హాయిగ నిద్రపోయాడు.

మరునాటి యుదయాన మగ గండభేరుండ పక్షి వచ్చి బాలవర్ధిని తన రెక్కలమీదెక్కించుకుని పైకెగసి సప్త సముద్రాలు దాటిపోయి పన్నెండామడల మర్రిచెట్టు దగ్గర దించి "రాజకుమారా నీవు లోపలకు పోయి పకీరు ప్రాణాలు తీసుకొని వచ్చేదాక నేనిక్కడనే వుంటాను. మళ్ళీ నిన్ను నా వీపు మీద నెక్కించుకొని పోయి నాగళ్ళపూడి గట్టుమీద దింపిగాని నేను నాయింటికి వెళ్ళను. నీవు పోయి విజయం సాధించుకుని శీఘ్రముగ ర" మ్మని చెప్పి పంపించింది.

బాలవర్ధిరాజు సరే నని మర్రిచెట్టు తొర్రలో ప్రవేశించాడు.

బాలవర్ధి నెదిరించడాని కెవరైనా వస్తారేమో—అలావస్తే వచ్చిన వారిని తన కాలిగోళ్ళతోగీరి—ముక్కుతోపొడిచి—రెక్కలతోకొట్టి సము

ద్రంలో విసిరి పారేయడానికని గండభేరుండపక్షి మర్రిచెట్టు చుట్టూ గస్తీ తిరుగుతూంది.

మర్రిచెట్టు తొఱ్ఱలో నుండి పాతాళలోకంలో అడుగుబెట్టిన బాలవర్ధికెన్నో ప్రతిబంధకా లెదురైనవి. రాకుమారుడు వాని నన్నింటిని లెక్క చేయకుండ ధైర్య సాహసాలతో ముందుకుపోయి నాగుమల్లిపొదను సమీపించాడు. అతని పొడగాంచినంతనే పొదనుండి నూరు నాగుబాములు బుసలు గొట్టుతూ వచ్చినై. అదిచూచి బాలవర్ధి కంపించి పోయాడు. అంతలో నాగేంద్రస్వామి అక్కడ ప్రత్యక్షమై "నాగములారా! మీరీ చిన్నవాని కెటువంటి అపకారమూ చేయకండి. ఇతడు నావరమున బుట్టిన బాలనాగమ్మ కుమారుడు బాలవర్ధిరాజు. బాలనాగమ్మను చెరబట్టిన పరమ దుర్మార్గుడు పకీరు. అతని పాపం పండింది కనుకనే యీరాకుమారు డింతవరకు రాగలిగాడు. పకీరు చావవలసిందే. మీరీ చిరంజీవికి పకీరు ప్రాణాలున్న చిలుకనీయండి" అని చెప్పి అదృశ్యమయ్యాడు.

అక్కడున్న సర్పము లన్నీ నాగమ్మకుమారుని గౌరవించినై. ప్రయాణపు బడలిక దీర నుపచర్యలు చేయించినై. విలువైన మణులను తెచ్చియిచ్చినై. పంజరంతోగూడ రామచిలుకను వాని చేతికి వప్పగించిన తరువాత వీడ్కోలు చెప్పినై. బాలవర్ధి విజయగర్వంతో తిరిగి వచ్చి దీవి గడ్డను చేరుకున్నాడు. తల్లిచెప్పిన గడువారోజుతో పూర్తయింది. తెల్లవారితే తల్లి ప్రసూవం పాలవుతుందని తహతహ లాడాడు. అతని మనోవేదనంతా తెలుసుకున్న గండభేరుండపక్షి "రాకుమారా! నీవు చింతపడే పనిలేదు. నిన్ను

తెల్లతెల వారే లోపల మాయలపకీరు కోటముందు విడిచిపెట్టేభారం నా"దని చెప్పి తనవీపుమీ దెక్కించుకుని మళ్ళీ రివ్వుమని యేగిరి రేయంతా పయనించి సూర్యోదయం వేళకు తెచ్చి పకీరు కోటలోనే దించింది.

# పంతము విడనాడని పకీరు

ఆనాటితో బాలనాగమ్మ పెట్టిన గడువు తీరిపోయింది. బాలవర్థిరాజింకా రానందులకామె తహతహ లాడుతూంది. ఇంక కొంచె మాగితే పకీరు నిర్బంధనం చేయబోతాడు. అంతకుముందే ప్రాణత్యాగం చేయడం మంచిది. పకీరు ప్రాణాలను తీసుకుని రావడమంటె సామాన్యమైన పనికాదు. బాలవర్ధి పసివాడు. ఇంత భయంకర కార్య మాతనికి వశపడిందనే నమ్మకం యామెకు లేదు. మధ్య మధ్య కుమారునకేదైన ప్రమాదం సంభవించినదేమోనని సందేహం కూడా బాలనాగమ్మకు కలుగుతూంది.

నన్ను గురించి నా చిట్టితండ్రి యెటువంటి కష్టాలు నెదుర్కొంటున్నాడో గదా! పకీరు చావకపోతె చావకపోనీ—నాచెర తీరకపోతే తీరకపోనీ నాకుమారునకేయాపదా లేకుండా యిల్లుచేరియుంటే నేను సంతోషంగా నాప్రాణాలను విడిచి యుందునే! అలాగానని నాయిప్పటి పరిస్థితి ననుసరించి తొందరపడి ఆత్మహత్య చేసుకుంటె—ఆ తరువాత నా కుమారుడు విజయం సాధించుకుని వచ్చి. నేను చనిపోయిన మాటవిని. "అమ్మా! నేనిన్నికష్టాలు

పడిగూడ నిన్ను దక్కించు కొనలేకపోయానా! అని గొంతెత్తి వాపోవకుంటాడా!" అని పరిపరి విధాల మదన పడుతూంది.

బాలనాగమ్మ తన వశం కాబోతూన్నదన్న సంతోషంలో పకీరు మునిగిపోతున్నాడు. వారం రోజుల నుండి పెండ్లి ప్రయత్నాలు గొప్పగ చేయిస్తున్నాడు. కోటనిండా పందిరిలు వేయించాడు. వీధులన్నింటికి అలంకారాలు చేయించాడు. ఇంటింటికి పచ్చాకు తోరణాలు కట్టించాడు. ఎక్కడెక్కడి మల్లెపూలు తెప్పించి దండలు కట్టించాడు. పుట్లకొలదిగ సాంబ్రాణి పొగలు వేయించాడు. పీపాలతో తెప్పించిన అత్తరు పన్నీరు గోడలమీన దిబ్బలమీద గూడ పోయించి యెటుచూచిన సువాసనలు ఘమఘమలాడేలా చేయించాడు. భాజాభజంత్రీలు రావించాడు. అందరికి విందుల యేర్పాటులు గూడ చేయించాడు.

పెండ్లివేదిక నిర్మింపబడింది.
లగ్నం సమీపించింది.
బాలనాగమ్మ నుండి స్వాగతం రాలేదు.
గజ్జలందెల మోతలతో గమళ్ళ సంగు వచ్చింది.

ఆమెను చూచి చూడడంతోనే అగ్గిమీద గుగ్గిలమై పోయాడు పకీర్. "నీవెందుకు వచ్చావ్" అని ఒక్క పొలికేక పెట్టాడు. సంగు ప్రశాంతంగానే "పకీర్! నామాట విను. నీప్రయత్నమంతా నాకు తెలుసు. నీకీరోజు యమ గండం తప్పదనిపిస్తుంది. బాలనాగమ్మ మహాపతివ్రత." అని హితం చెప్పబోయింది.

తోక త్రొక్కిన త్రాచులా మండిపడుతూన్న పకీరు "సంగూ! నీవీ మాట చెప్పటానికనే యింతదూరం వచ్చావా! నీసలహా నాకవసరం లేదని యేనాడో చెప్పాను. నీకికమీద యీ పకీరు కోటలో పనిలేదని గూడ చెప్పాను. పకీరు ప్రాణాలకు యమగండమా! అదేదో చూడకుండ విడిచిపెట్టను. అంతు తేల్చుకుంటా" నని సంగు రెక్క పట్టుకుని చరచరా పూజా మందిరంలోనికి తీసుకొని పోయి మంత్రదండం చేతపుచ్చుకుని "కాపాలీ!" అని పిలిచాడు.

కాపాలి పలికి "ఏమిటి పకీరు!" అన్నది.

"నేనీరోజు బాలనాగమ్మను పెండ్లాడ బోతున్నాను. "ఈ పెండ్లిజరగదని. నాకు యమగండం తప్ప"దని అంటుంది సంగు. నీవేమంటావ్?" అన్నాడు.

"సంగు చెప్పింది సత్యం. బాలనాగమ్మ మహాపతివ్రత. ఈరోజుతో నీయాట కట్టపోతూంది. పానుగంటి వీరుడు. నీప్రాణాల దీయనున్నాడు." అన్నది కాపాలి. ఉగ్రుడై పోయిన పకీరు హుంకరించాడు. "కాపాలీ! మాయలపకీరుతోనే మంతనాలాడుతున్నావు. నాకు మరణమా! నీనోరు కట్టివేస్తున్నాను చూడు"మంటూ మంత్రదండం చూపాడు. కాపాలి నోటినుండి మాట రాకుండా నిలిచి పోయింది.

# పకీరుకు జరిగిన పరాభవము

వినాశనపుకాలాన విపరీత బుద్ధులంటారు. చెంత నున్న మంచి చెడ్డగ కనుపిస్తుంది. అందలాలెక్క బోయి అగాధంలో పడిపోతారు. పకీరు పరిస్థితి గూడ అలాంటిదే. బాలనాగమ్మలాంటి అందాలరాణి తనకు భార్యకాబోతూన్నదనే యీర్ష్యతో వీరంతా పడగొట్ట చూస్తున్నా రనుకున్నాడు. వారం రోజులనాచే బాలనాగమ్మ తన్ను వివాహమాడుతానని స్వయంగ చెప్పింది. ఆమెకు తన ప్రాణరహస్యం గూడ చెప్పేశాడు. బాలనాగమ్మ వ్యతిరేకిస్తుందనే అనుమాన మతనికి లేదు.

బాలనాగమ్మ దగ్గరకు పోయి అసలు విషయం తేల్చుకుందా మనుకున్నాడు. అంతలో వానికో యాలోచన కలిగింది. ఆమె అప్సరసలను మించిన అందగత్తె. తన మెడలో తాయిత్తులు. యంత్రాలు చూచి చీదరించుకుంటుందేమోనని అనుమాన వడ్డాడు. ఎలాగానైనా క్రొత్త పెండ్లి కొడుకును గదా! నాకీ గంగిరెద్దు బొంతవేషమెందు కనిపించింది. వెంటనే దండచేతి కడియం, మెడలోని యంత్రాలు, ఎముకల దండలన్నీ తీసిపారేశాడు. పరిచారికులను పిలిపించుకుని పన్నీట స్నానం చేశాడు. పట్టుజరీ యంచు పంచలు

గట్టాడు. పునుగు జవ్వాజీలు పులుము కున్నాడు. ఇంక యేమేమొ అలంకారాలు చేసుకున్నాడు. నీటుగ బాలనాగమ్మ యున్న బందిఖానాకు పోయాడు.

పకీరు రాక చూస్తూనే బాలనాగమ్మ పెడమొగం పెట్టింది.

అది చూస్తుండనే పకీరుకు నిలువు గుండెలు పడినై.

కథంతా యిలా పెడతిరిరిందే మనుకున్నాడు. ఆమెలో యిదివర కెన్నడూలేని క్రోధమీనాడు కొట్టొచ్చినట్టుగ కనపడుతూంది. ఐనా సంగతేమిటో తేల్చుకోవాలనే పట్టుదల పకీరులో బలపడి పోయింది. గట్టిగా ఒక్కసారి "బాలా!" అన్నాడు.

ఆమె పలుక లేదు.

అసలేకోతి—అందులో కల్లుద్రావింది—ఆపైన నిప్పులు త్రొక్కిందన్నట్లయింది పకీరు పని. "వారం రోజుల నాడు నీవు నన్ను పెండ్లాడతానన్నావు. నా ప్రాణరహస్యం చెప్పించుకున్నావు. నిన్నిపుడేం చేస్తానో తెలుసా!" అని అంకె పెట్టాడు. బాలనాగమ్మ కనులెఱ్ఱచేసి చూచింది. "ఛీ! పశువా! దూరంగాపోరా! నీవు నన్నేం చేయగలవు? కొంతకాలానికైన నీ మనసు మార్చుకుంటావని తలంచి పదునాలుగేండ్లు నాకు వ్రతమున్నదని కాలవ్యవధికి అబద్ధమాడాను. నీలో పరివర్తనలేదు. పతివ్రతల నర్థం చేసు

కొనలేని పాపాత్ముడవు. నీముఖం చూడనుపో" అని పురుగును విదిలించినట్లు విధిలించి పారేసింది.

ఆ మాటలతో పకీరు తల తిరిగి పోయింది. "బాలనాగూ! నేను నిన్నెంతగ ప్రేమించుతున్నానో నీవు తెలిసికొనడం లేదు. కాలసర్పంతో పరిహాసాలాడుతున్నావు. ఈమాట నీవింతకు ముందేచెప్పియుంటె నిన్నేనాడో నావశం చేసుకొని యుండేవాడిని. ఇప్పటికైన మించి పోయినది లేదు. ఇది నాకోట—నామహలు—నాబందిఖాన—నాపరివారం. నీకిక్కడ పిలిచినా పలికే దిక్కులేదు. నిన్నిప్పుదే బలవంతంగా వశపరచుకొనకపోతే నేనింక బ్రతికినా యొక్కటె—చచ్చినా యొక్కటే"నని రెండడుగులు వేశాడు.

బాలనాగమ్మ వీరావేశం పొందింది. "ఆగు అడుగుముందుకు వేశావా అంతమై పోతావు. నేనే శ్రీనాగేంద్రస్వామి వరమున బుట్టిన బాలనాగమ్మనైతే—పానుగంటి పురాధీశ్వరులు కార్యవర్థిరాజు ధర్మపత్నినైతే—కలనైన పరపురుషుని తలంచి యెరుంగని పతివ్రత నైతే—దైవముంటె—ధర్మముంటె నీవు నీకోట నీమంత్రశక్తులన్నీ నిలువునా దహించి పోవాలి. నీవు సర్వనాశనమై పోతావురా!" అని శపించింది.

వెనుకనుండి యెవరో ఆగు పకీర్ అన్నారు.

పకీరలాగే ప్రాణాలున్న ప్రతిమలాగా స్థంభించిపోయాడు.

# ప్రాణాలతో బతికిపోయిన పకీరు

"నీ యంతమ్ము చూచే రోజు వచ్చింది పకీర్" అనే మాట మళ్ళీ విన పడింది.

పకీరు వెనుకకు తిరిగి చూచాడు.

అతడొక యువకుడు. పదునాలుగేండ్లుండ వచ్చు. అంతా వీరయ్య లాగానే వున్నాడు. వీరయ్య కీ దుస్తులు లేవు. ఆభరణాలు లేవు. వీడెవడో రాజకుమారుడు. వీరయ్యా పేరు పెట్టుకుని నన్ను మోసగించాడు. ఔను. తంబళ్ళపెద్ది దగ్గరనుండి వారం రోజులనాడే వెళ్ళిపోయిన వీరయ్యా యింత పని చేశాడు. వానికి చిలుక పట్టుబడిందా! ఇది నిజంగా నా ప్రాణాలున్న చిలుకేనా! అది వీడికెలా చిక్కుతుంది? అది కాకపోతే వీనికింత ధైర్య మెలాగా వచ్చింది! నామహలు లోనికి పారాలు తప్పించుకొని యెలా రాగలిగాడను కుంటూనే "వీరయ్యా!" అన్నాడు.

ఔను. నేనే. నేనేకాని—నీవనుకుంటున్న వీరయ్యను కాను. బాలనాగమ్మ కొడుకును. బాలవర్ధి రాజును. పెద్ది దగ్గర వీరయ్య లాగా నటించాను. ఆమె వలన నీకోటకు వచ్చాను. నీగుట్టు మట్టులన్నీ తెలుసుకున్నాను. సప్త సము

ద్రాలు దాటాను—మర్రిచెట్టు తొర్రలో దూరాను. పాతాళలోకం పోయాను. నాగుమల్లి పొదలోని రామచిలుకను పట్టుకొన్నాను. నిన్ను చంపి, నీకోటను నేలమట్టం చేసి. నాతల్లిదండ్రులను విడిపించుకొని పోవడానికి సిద్ధంగా వున్నాను. ఏం! నీ యనుమానం తీరిందా!” అన్నాడు రాజకుమారుడు.

పకీరు ఒక్కసారి బిగ్గరగ “నన్ను మోసం చేశావ్” అన్నాడు.

బాలవర్ధిరాజు పకపకా నవ్వి “ఏమిటీ! నిన్ను మోసం చేశానా! నీవు మోసం చేయలేదూ! మాయ జంగం వేషం వేసిందెవరు? మహేశ్వరునను భిక్షడిగిందెవరు? ఏడు రోజులైనా నిండని తల్లి బిడ్డల విడదీసిందెవరు? పతివ్రతామ తల్లిని పట్టి నిర్భంధించిందెవరు? పకీర్! నిన్ను యింకొకరు మోసం చేశారనడానికి నీ నోరెలా వచ్చిందిరా! నీ ముఖానికి సిగ్గులేదురా! నేటితో నీకాయువు మూడిందిరా!” అంటూ చేతిలోని చిలుక కాలు పట్టి లాగాడు. పకీరు తన కాలిమీదెవరో గొడ్డలిపెట్టు పెట్టినట్లు కేకలు పెట్టేడు. బాలవర్ధి చిలుక రెక్క విరిచాడు. పకీరు తన భుజం విరిగి పోయినట్లు చిందులు పెట్టాడు. బాలవర్ధి చిలుక గొంతుక పట్టుకున్నాడు. పకీరు తన గొంతు నెవరో యురి బిగించినట్లుగా క్రిందపడి గిలగిల తన్నుకున్నాడు.

బాలనాగమ్మ కుమారుని దగ్గరకు పోయింది.

పకీరిపుడు కోరలు పీకిన పామయ్యాడు.

తెప్పరిల్లుకుని లేచి నిలబడిన పకీరు "ఒరేయ్ బాబూ! నీకు పున్నె ముంటుంది. నీవా చిలుక నేమీ చేయకు. నీవడిగినంత ధనమిస్తాను. కావాలని నీవడిగిన దేదైనా యిస్తాను. నాచిలుకను నాకిచ్చివేయి" అని చేయి చాచాడు.

నేనడిగింది యిస్తావా అన్నాడు బాలవర్థి.

"ఇస్తా" నన్నాడు పకీరు.

"నీ మంత్ర దండ మిలా యీయ్" అని బాలవర్థి అనగానే పకీరు "మంత్రదండమిస్తే నాకింక బలమేమున్నది బాబు? అది కాకుండ యింకే దయినా అడుగు. తప్పకుండా యిస్తా" నన్నాడు. నాకా మంత్రదండమిస్తేనే నేనీ చిలుకను నీకిస్తాను. పకీర్! నేనేం పిట్టలను పట్టుకొచ్చి అమ్ముకునే వాని ననుకున్నావా! ఇంత శ్రమపడి యీ చిలుకను పట్టుకొచ్చింది నీవలన బహుమానం పొందడాని కనుకున్నావా! పిచ్చి పిచ్చి వేషాలు వేయక బాలనాగమ్మ నీకేం కావాలనో చెప్ప" మన్నాడు బాలవర్థి.

"బాలనాగమ్మ నాకు కాబోయే భార్య" అని అంటూండగనే బాలవర్థి చిలుక పీకె నొక్కాడు. పకీరు పని మళ్ళీ ప్రాణాంతక మయింది. బాలవర్థి "పకీర్! బాలనాగమ్మ నీప్రాణాలు కాపాడిన తల్లి యని పాదాలకు మొక్కుతావా లేదా!" అనాడు. పకీరింక పనస్థితి నర్థం చేసుకున్నాడు. అమాంతంగా బాలనాగమ్మ పాదాల ముందు సాగిల పడి "తల్లీ! నా అపరాధం మన్నించు.

నిన్నింక అమ్మా అని పిలుస్తాను. ప్రతికి యుండగ యిక యిట్టి బుద్ధి తక్కువ పను లెన్నటికి చేయను. నా ప్రాణాలను కాపాడ" మని మొరబెట్టు కున్నాడు. బాలనాగమ్మ కుమారునితో "నాయనా! పడగ వంచిన పాముసు గొట్టుట పాడిగాదు. చంపదగినట్టి శత్రువైనను శరణుజొచ్చిన వానిని మీ తండ్రులు చంపి యెరుగరు. వీనినింక ప్రాణాలతో విడిచి వేయడం మన ధర్మ" మన్నది.

## బాలవర్ధి సాధించిన ఘన విజయము

కన్న తల్లితో నీవు చెప్పినట్లే చేస్తా నని బదులు చెప్పిన బాలవర్ధి రాజు పకీరు వంక చూచి "ఓయీ! పాదాక్రాంతుడ వయ్యావు కనుక నిన్ను ప్రాణాలతో విడిచిపెడుతున్నాను. కాని నీకింక యీ శక్తులుండరాదు. మంత్ర దండం నాకిచ్చివేయ్. చిలుక రెక్కలు విరిచి నీమంత్రబలమంతా నశింప చేస్తున్నాను. నీవింక యింటింటి ముందు బిచ్చమడుగుకొని పొట్ట నింపుకో. ఇక మీద నీవందరిని చూచి భయపడాలి కాని నిన్ను చూచి యెవరూ భయ పడరాదన్నా"డు. పకీరు దక్కించుతూ మంత్రదండం బాలవర్ధికి యిచ్చి ప్రాణాలతో ప్రతికి బయట పడ్డాడు.

మంత్రదండం చేతపుచ్చుకున్న బాలవర్ధి ముందుగా బాలనాగమ్మను వెంటబెట్టుకొని పోయి శిలా ప్రతిమలుగా మారి యున్న తన తండ్రులు లేక్ష్గరకు నిజరూపాలు వచ్చేలా చేశాడు. వారికి బాలనాగమ్మ కనుపించింది. "బారా!" అన్నాడు కార్యవర్ధిరాజు. "ఔనండి నేనే. మీబాలను. మనచిరంజీవి బాలవర్ధిరాజు. పకిరును జయించి, నాచెర విడిపించి, పకిరు మంత్రదండంతో మిమ్ములనందరిని తిరిగి మనుషులను చేశా" డని పరిచయం చేసింది. వర్ధిరాజులందరూ వంశోద్ధారకుడైన కుమారుని బిగ్గ కౌగలించుకుని ఆనంద బాష్పాలు విడిచారు. తరువాత బాలవర్ధి వారి ముగ్గురు మంత్రులను, యిరవై వేల సైన్యాన్ని గూడ మనుషులను చేశాడు. వారంతా సంతోషపడ్డారు.

బాలవర్ధిరాజుంకట తన తల్లిని తండ్రులను వెంటబెట్టుకుని చుట్టుప్రక్కలందు రాలుగ రప్పలుగా పడియున్న రాకుమారులకు గూడ మంత్రదండంతో నిజరూపాలు కలిగించి "మీమీ నగరాలకు పోయి హాయిగ రాజ్యాలేలుకొనండి" అని చెప్పాడు. వారంతా బాలవర్ధికి ధన్యవాదాలు చెప్పుకున్నారు. పూజామందిరం లోనికిపోయి కాపాలికి పకీరు బంధించిన వాగ్బంధం తప్పిచాడు. శక్తుల నన్నింటిని పిలిచి మీకింక క్షుద్రశక్తులుగా గాకుండా పోయి గ్రామాలలో ప్రజలను చల్లగా కాపాడండి అనిచెప్పి పంపాడు. సంగును—తంబళ్ళపెద్దిని పిలిపించి వారికికావలసినంత ధనమిచ్చి సుఖంగా బ్రతకండి అన్నాడు.

అలాగా అందరిని కాపాడి అందరి చెరలు విడిపించి పంపిన తరువాత బాలవర్ధి పకీరు కోటలోని బంగారం వెండి రత్నాలు మొదలైన సంపదలన్నీ పానుగంటిపురం నుండి వచ్చిన రథాలమీద ఏనుగులమీద ఒంటెలమీద వేయిం చుకుని నగరానికి ప్రయాణమయ్యారు. ఇతర దేశాలనుండి వచ్చిన రాకుమారులంతా వర్థిరాజులవెంట ననుసరించారు. వారంతా విజయవంతంగ ప్రయాణం సాగించి పోవుచుండ చిలుకవాదిపట్నం సమీపించింది. చిలుకవాదిపట్నం యేలురాజు మంత్రి పురోహితులతో యెదురువచ్చి పానుగంటి ప్రభువులను కానుకలతో సత్కరించాడు.

"వర్థిరాజులారా! నేనీనగరమేలు రాజును. నాకుమార్తెకు లేచి మానక పోయిన రాచకురుపును మీకుమారుడు ఒక్కకట్టుతో మాన్పి నాకుమార్తె ప్రాణాలు కాపాడాడు. మేమంతట నాకుమార్తెను వివాహమాడవలసినని కోరగ మీకుమారుడు నేను తిరిగివచ్చేటప్పుడు. మీకోరిక నెరవేరుస్తానన్నాడు. మేమప్పటినుండి బాలవర్థికి విజయం కలగాలని వేయిదేవుళ్ళకు మొక్కుకుంటున్నాం. ఇప్పుడంతా సంతోషం. దయచేయండి" అనగా వర్థిరాజులానందించి "బావగారి యిష్టమొచ్చినట్లేకానీయండి" అన్నారు. చిలుకవాది పట్టణపురాజు సుముహూర్తాన తన కుమార్తెను బాలవర్థిరాజునకిచ్చి వైభవోపేతంగా వివాహం చేశాడు. కొన్నిరోజు లక్కడున్న పానుగంటి ప్రభువులు వియ్యాలవారి కట్నాలందుకుని నగరానికి ప్రయాణమయ్యారు.

మరికొంతదూరం వచ్చాక గంగపట్నమేలు రాజు తనపరివారంతో యెదురై వర్ధిరాజులకు స్వాగతం చెప్పి "అయ్యలారా! మీబాలవర్ధికి ప్రాణ దానం చేసిన వారము వేము. మా ప్రార్థన నిరాకరింపక నాకుమార్తెను గూడ మీకోడలుగ స్వీకరించండి" అని బాలవర్ధికి తన పుత్రికినిచ్చి వివాహం చేశాడు. వర్ధిరాజు లక్కడ నుండి బయలుదేరి వచ్చుచుండగ దారిలో పులిరాజు వారి నభినందించి నగరికి గొనిపోయి బాలవర్ధికి తన కుమారినిచ్చి కల్యాణం గావించాడు. బాలవర్ధి యిట్లు విజయ పరం పర లందుకొని పసుపుగుడ్డల పారాయణలతో, పెండ్లి కుమార్తెలను వెంట బెట్టుకొని, తల్లి దండ్రులు—పరివారం—బంధుమిత్రులతో సలక్షణంగ పానుగంటిపురం వచ్చి చేరుకున్నాడు.

# బాలవర్ధి రాజ్యపాలనము

మాయలపకీరును జయించి తల్లి చెరవిడిపించుకుని విజయవంతంగ తిరిగి వచ్చుచున్న బాలవర్ధిరాజుకు పానుగంటి పురప్రజలంతా ఘనస్వాగతం చెప్పారు. రాచనగరు ప్రవేశించినంతనే మహారాణు లార్వురూ నీరాజన లిచ్చారు. బాలనాగమ్మ అక్కలను గాఢాలింగనం చేసుకుంది. బంధువులంతా పలుకరింప వచ్చారు. బాలవర్ధిరాజు కీర్తిప్రతిష్టలు దేశదేశాలకు వ్యాపించింది.

ఒక మంచి ముహూర్తాన వర్ధిరాజులంతా బాలవర్ధిరాజుకు పానుగంటి పుర పట్టాభిషేకం చేశారు. ప్రపంచంలోని రాజులంతా వచ్చి నూతన పట్టాభిషేక కాలంలో కట్నాలు చదివించారు. ఢిల్లీనుండి పాదుషావారు స్వయంగా వచ్చి వర్ధిరాజుల నభినందించుతూ "బాలవర్ధి! నీవు సమర్థుడవు. నీలాంటి రాజకుమారునకు నేను చక్రవర్తిని కాజాలను. ఈరోజునుండి నీవు నాకు కప్పం కట్టనవసరం లేదు. నీవు స్వతంత్రరాజు"వని అభినందించాడు.

కవులు పండితులు బాలవర్ధి నాశీర్వదించారు.

బాలవర్ధి పరిపాలనలో ప్రజలకే చీకూ చింతలు లేక సుఖంగ జీవించారు.

బాలవర్ధి తన రాజ్య మంతటా విద్యాశాలలు నెలకొల్పాడు. లలితకళల నాదరించాడు. కవులు, గాయకులు, పండితులు, శిల్పులు మొదలైనవారి కగ్రహారాల నిచ్చిపోషించాడు. ఉచిత వైద్యశాలలు నిర్మించాడు. ఇంకా బాలవర్ధి చేయని మం పనంటూ లేదు. అందరికీ సంతోషం—అందరికీ విజయం.

కధ కంచికి—మనమింటికి

